ఓం

శ్రీ గురుభ్యోనమః

# ప్రవృత్తి - నివృత్తి
# మార్గ పరిశీలనా
# బ్రహ్మాండ-ఉత్పత్తి-స్థితి-లయ-లక్షణములు



శ్రీ మద్భాగవత కృష్ణదేశిక ప్రభువులవారు

సేకరణ

**శ్రీ నిర్మలానంద కాడిగె నారాయణ**

కార్వాన్, హైదరాబాద్

ఓం

శ్రీ గురుభ్యోనమః

# ప్రవృత్తి - నివృత్తి - మార్గ పరిశీలనా

## బ్రహ్మాండ - ఉత్పత్తి - స్థితి - లయ - లక్షణములు

అను గ్రంధస్థవిషయములు

**శ్రీ బోదానంద సజ్జారామమూర్తిగారి వలన గ్రహించి,**
**శ్రీ నిర్మలానంద కాడిగె నారాయణ గారి ప్రోత్సాహముచే**
**వారి ప్రియ శిష్యులు శ్రీ వీసంశెట్టి విద్యాసాగర్, శ్రీ గొర్ల సునీల్ కుమార్,**
**శ్రీ జ్యోతి సత్యనారాయణ మరియు గురుభక్తాదుల ద్రవ్యసహాయముచే**
**ముద్రణ గావింపబడినది.**

సేకరణ :

**నిర్మలానంద కాడిగె నారాయణగారు**

ఇ.నెం. 13-4-757/1బి, కార్వాన్,

హైద్రాబాదు - 500 067.

ప్రతులు : 1000

రూ॥ 15/-

# విజ్ఞప్తి

సాంప్రదాయ గురుబంధువులందరికి వందనములు. విషయమేమనగా ప్రవృత్తి - నివృత్తి - మార్గపరిశీలనా అనుగ్రంథము గ్రంథస్థవిషయములు పరమగురువులు పూజ్యులు శ్రీ భోదానంద సజ్జా రామమూర్తి నాయన, తాడేపల్లిగూడెం అవదూతాశ్రమ పీఠాధ్యక్షులు. వారిచే గ్రహించి మధ్భక్తులు శ్రీ వీసంశెట్టి విద్యాసాగరు, శ్రీ గొర్ల సునీల్ కుమార్, శ్రీ జ్యోతి సత్యనారాయణ మరియు గురుభక్తాదుల ద్రవ్య సహాయముచే ముద్రణగావింపబడినది.

ఇందు బ్రహ్మాండ-పిండాండ-ఉత్పత్తి-స్థితి-లయము-తారక-సాంఖ్య-అమనస్క-మహావాక్యవిచారణ-పంచముద్రల-లక్షణములు-స్వరూప-అరూప-మనోనాశము-పంచభూతలయము మున్నగు విషయములు చర్చించబడినవి. మనకు మార్గ దర్శకులైన శ్రీమత్ పరుశురామ సీతారామ స్వామివారిచె రంచింప బడిన పరుశురామ సీతారామ శతకములో

శ్రీరామ శడాక్షరి తారక సాంఖ్యామనస్క - తత్వములోనన్ ॥
సారముగని వైకుంఠము - జేరితివౌ పరుశురామ సీతారామా ॥

అని పల్కిన వాక్యము సాంప్రదాయులెల్లరకు ఆచరణ యోగ్యమనుటలో సందేహం లేదు. మనమందరము వారి మార్గానువర్తనులమై యున్నారము.

కావున ఇందలి విషయములు క్షుణ్ణంగా చదివి, విషయములు గ్రహించి ఆచరించి ఆనందించగలరని మనవి.

గ్రంథముద్రణకు తోడ్పడి ధనసహాయమొనర్చిన గురుభక్తాదులకు గ్రంథ ముద్రణకు సమ్మతి తెలియపరిచిన తాడేపల్లిగూడెం అచలాశ్రమవాసులు, అధ్యక్ష ఉపాధ్యక్షులు : శ్రీ టి. ఉమామహేశ్వరరావు, శ్రీ జె. ఇంద్ర భోగేశ్వరరావువారలకు సకాలములో ముద్రణగావించి ఇచ్చిన ప్రింటింగ్ ప్రెస్ వారికి గ్రంథావలోకన మొనర్చు పాఠక మహాశయులకు ప్రత్యక్షముగా, పరోక్షముగా సహకరించిన సాంప్రదాయ గురుబంధువులందరికి ధన్యవాదములు. వీరందరకు శ్రీ గురు పరమాత్మ కృపా కటాక్షములు ప్రసాదించి రక్షించుగాకయని కోరుచున్నాను.

ఇట్లు
సేకరణకర్త
నిర్మలానంద కాడిగె నారాయణ
ఇ.నెం. 13-4-757/1బి కార్వాన్,
హైద్రాబాద్ - 500 067.

ప్రతులు : 1000
శ్రీ వృషనామ మాఘ శు॥ ౧౫ పౌర్ణమి
ది. 27-02-2002
వెల రూ ॥

.ఓం.

శ్రీ గురవేనమః

# ప్రవృత్తి మార్గ పరిశీలనా

శ్లో॥ గురుర్బ్రహ్మ । గురు ర్విష్ణు, గురుర్దేవూ మహేశ్వరః।
గురుస్సాక్షాత్ పరబ్రంహ్మ, తస్మైశ్రీ గురవే నమః।

శ్లో॥ ఓంనమో బ్రంహ్మాదిభ్యో, బ్రంహ్మ విధ్యా సాంప్రదాయ కర్తృభ్యో, వంశ రుషిబ్యో, మహాద్భ్యో, నమోగురుభ్యః । సర్వో పప్లవ రహిత. ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్ధో। బ్రంహ్మైవాహమస్మి। అహం పదార్ధ రహితః।

## బ్రహ్మాండ వుత్పత్తి, స్థితి, లయ లక్షణములు :-

బ్రంహ్మణో రవ్యక్తా । అవ్యక్తా మహతః। మహతోమహదహంకారః। మహదహంకార। పంచతన్మా త్రాణి। పంచతన్మాత్రాణి పంచభూతాని। పంచ భూతాని, అఖిలంజగత్ । అనిశృతి।

అనగా సర్వా సత్తాస్వరూపమై బ్రంహ్మయందు. అవ్యక్త స్వరూపమైన ప్రకృతి బ్రంహ్మసత్తా చేత సత్తగలద్దై విజృంబించి మహత్ ఆయెను। మహత్తే, మహదహం కారమై, మహధహంకారము నుండి పంచతన్మాత్రలు వెలువడి, పంచతన్మాత్రలే, పంచమహాభూతములుగా పరిణాయము జెంది. జగత్తు ఆయెను. పంచతన్మా త్రలు ఏవిధముగా విజృంభించి జగత్తు అయేననగా -

### 1. శబ్ద తన్మాత్ర :-

అవకాశమిచ్చుటనె. ధర్మము. తిరుగ నిచ్చుట కూర్చో నిచ్చుటనే ఖర్మము। ప్రతిధ్వనియనే గుణమున్నూ, సునీలమనే వర్ణమున్నూ। వర్తులాకారముగల ఆకాశమాయెను। ఆకాశము యొక్కసూక్ష్మాంశము. శబ్దము। శబ్దము యొక్క సూక్ష్మాంశము, పరాశక్తి, పరాశక్తి యొక్క సూక్ష్మాంశము, సదాశివుడనే. ఆది దేవతాయెను :-

**2. స్పర్శ తన్మాత్ర పరిణామము:-**

చలించుటనే ధర్మము. విస్తరిచుటనె. కర్మము న్నూ, శీతోష్ణస్పర్శలనే గుణమున్నూ। ధూమ్ర వర్ణమున్నూ షట్కోణాకారముగల. వాయువాయెను। వాయువు యొక్క సూక్ష్మాంశము. స్పర్శ, స్పర్శ యొక్క సూక్ష్మాంశము. ఆదిశక్తి, ఆదిశక్తి, యొక్క సూక్ష్మాంశము. యం బీజము। యంబీజము యొక్క సూక్ష్మాంశము ఈశ్వరుడనే ఆది దేవతాయెను।

**3. రూపతన్మాత్ర పరిణామము :-**

ఊష్ణించుటనె ధర్మము, మార్పు చేయుటనే కర్మమున్నూ ప్రభాగుణమనే, గుణమున్నూ, అసితవర్ణమనే వర్ణమున్నూ। త్రికోణాకారముగల. అగ్ని మాయెను, అగ్ని యొక్క సూక్ష్మాంశము, రూపమున్నూ, రూపము యొక్క సూక్ష్మాంశము జ్ఞానశక్తి। జ్ఞాన శక్తి యొక్క సూక్ష్మాంశము రంజీజము। రంబీజము యొక్క సూక్ష్మాంశము రుద్రుడనే అది దేవతాయెను,

**4. రసతన్మాత్ర పరిణామము?--**

తడుపుటనే ధర్మము, పోషించుటనే కర్మమున్నూ। మాదుర్యరసమనే, గుణమున్నూ। శ్వేతవర్ణమునే వర్ణమున్నూ। అర్ధ చంద్రా కారముగల జలమాయెను। జలము యొక్క సూక్ష్మాంశము, రసము, రసము యొక్క సూక్ష్మాంశము ఇచ్చాశక్తి। ఇచ్చాశక్తి యొక్క సూక్ష్మాంశము వంబీజము। వంబీజము యొక్క సూక్ష్మాంశము. విష్ణువనే అదిదేవతాయెను.

**5. గంధతన్మాత్ర పరిణామము:-**

కఠినత్వమనేధర్మము, పుట్టించుటనే కర్మము సుగంధ దుర్గంధమనే గుణమున్నూ,రక్త వర్ణమనే వర్ణమున్నూ, చతుష్కోణాకారముగల పృధ్వి ఆయెను। పృధ్వి యొక్క సూక్ష్మాంశము. గంధము. గంధము యొక్క సూక్ష్మాంశము క్రియా శక్తి। క్రియాశక్తి యొక్క సూక్ష్మాంశము లం భీజము లం బీజము యొక్క సూక్ష్మాంశము బ్రంహ్మనే అదిదేవతాయెను।

**వచనము** : ఈ విధముగా బ్రంహ్మ సర్వశక్తి సంపన్నుడై నిమిత్తకారణముగా వుండి కారణ రూప ప్రకృతి చేత. కార్యరూపమైన బ్రంహ్మాండమును. సృష్టించెను దీనికే మనపెద్దలు భద్రాద్రిరామ శతకమందు ఇట్లు చెప్పిరి.

**సీ॥** వసుదాజలంబగ్ని వాయు వాకాశంబు లివి పంచభూతముల్ వీటి యందు।రక్త శుభ్రాసిత యుక్త, ధూమ్ర సునీల ములు. గందరస, రూపములును, స్పర్శ, శబ్దంబులును, క్రియాశక్తి జ్ఞానేచ్ఛాది, శక్తులు, పర పరాశక్తి లవరయఅ జ విష్ణుత్రియంబ కేశ్వర సదా శివులు, నొండొంటికి. స్థిరముగాను వర్ణగుణశక్తి బీజదేవతులు. నుండు. నీకునే గుణములు. లేవు నిర్మలుడవు. రమ్య గుణధామ. భద్రాద్రిరామ.

## బ్రాహ్మాండ స్థితి అనగా చరా చర జీవుల యొక్క వుత్పత్తి ఎట్లనగా .....

పంచభూతములనె పంచక్షేత్రములకు. సూక్ష్మాంశమైన పంచదేవతలనే. పంచక్షేత్రజ్ఞులకు, స్థూలాంశమైన, పంచబీజములనే విత్తనములద్వారా పంచ బీజములకు స్థూలాంశమైన, పంచశక్తులనే పరికరణముల చేత, పంచశక్తులకు స్థూలాంశమైన, పంచతన్మాత్రలనే ఎరువుల చేత. పంచతన్మాత్రలకు స్థూలాంశమైన పంచక్షేత్రముల యొక్క

*వ్యవహారికం ఎట్లనగా :*

1. పృధ్వి క్షేత్రము నుండి పుట్టించుట.
2. జలక్షేత్రము నుండి పోషించుట.
3. అగ్ని క్షేత్రము నుండి, రూపించి, రూపమును, మార్పు చేయుట
4. వాయు క్షేత్రమునుండి, విస్తీర్ణింప జేయుట।
5. ఆకాశ క్షేత్రము నుండి, పెంపొందింప జేయుట

మొదలైన వ్యవహారములు జరుగు చున్నవి.

1. పృధ్వియొక్క సూక్ష్మాతి సూక్ష్మం, సూక్ష్మాతి సూక్ష్మస్వరూపుడైన బ్రంహ్మ అనె అది దేవత. బ్రంహ్మ అనె ఆది దేవత కన్నను. స్థూలాంశమైన లంబీజము యొక్క ప్రేరణ వలన. లంబీజము కన్నను స్థూలాంశమైన క్రియా శక్తితో గూడుకోని.

క్రియాశక్తికన్నను. స్థూలాంశమైన గంధత న్మాత్రద్వారా. గంధ తన్మాత్ర కన్నను స్థూలాంశమైన పృధివి భూతము, నుండి బ్రంహ్మ యెనుబడి నాలుగు లక్షల జీవో పాదులను పుట్టించు చున్న వాడా యెను. ఇట్టి యెనుబది నాల్గులక్షల జీవోపాదులను. ఏవిధముగా పంచిరి అనగా -

శ్లో॥ జలజానవలక్షంతు। పక్షీ ణాందశలక్షకం।
క్రిమిణాంరుద్ర సంఖ్యాచ। వింశతుల క్షంతుస్థావరః।
త్రిశంతు పశుజాతీనాం। చాతుర్లక్షంతుమానవః।
పుణ్యపాపసమంకృత్వా। నరజన్మ సుజాయతె।

**తాత్పర్యము:-** జలచరములు 9 లక్షలు పక్షులు 10 లక్షలు క్రిములు 11 లక్షలు, స్తావరములు 20 లక్షలు జంతువులు 30 లక్షలు, మానవులు 4 లక్షలు. మొత్తం 84 లక్షలు జీవోపాదులు. ఇవి ఉద్భిజములు. స్వేదజములు. అండజములు. జరాయు జములు. అని చతుర్విధములు। అనగా భూమిని పెళ్లగించు కొని పుట్టినవి. ఉద్భిజములు. ఉదాహరణ। చెట్లు మొదలగునవి. స్వేదజములు అనగా. చెమటవల్ల పుట్టినవి. ఉ॥ నల్లులు, పేలు, అండజములు అనగా గ్రుడ్ల వల్ల పుట్టినవి ఉ॥ కోళ్లు, బాతులు, పక్షులు, జరాయుజములు. మావిచే కప్పబడి పుట్టునవి. మనుష్యులు, మృగములు ఇది పృథ్వీక్షేత్ర సమాచారము.

**ఇహ పృధ్వీ క్షేత్రము కన్న స్థూలాంశమైన జలక్షేత్ర సమాచారమెట్లునగా**

2. జలము యొక్క సూక్ష్మాతి సూక్ష్మం సూక్ష్మాతి సూక్ష్మ స్వరూపుడైన విష్ణువు అనే ఆదిదేవత. విష్ణువు అనే అదిదేవత కన్న స్థూలాంశమైన. వంబీజము యొక్క ప్రేరేపణవలన। వంబీజము కన్న స్థూలాంశమైన ఇచ్ఛాశక్తితో గూడుకొని. ఇచ్ఛాశక్తి కన్న స్థూలాంశమైన, రసతన్మాత్ర ద్వారా. రసతన్మాత్ర కన్న స్థూలాంశమైన జలభూతము పృధ్వి భూతము నుండి సకల చరా చరములు పుట్టింపుచున్న బ్రంహ్మ, జలభూతము నుండి విష్ణు స్వరూపుడై సకలచరాచరములను పోషింపు చున్నవాడాయెను.

**జలక్షేత్రము కన్న స్థూలాంశమైన అగ్ని క్షేత్ర సమాచారమేమనగా :**

3. జలము యొక్క స్థూలాంశము. అగ్ని. అగ్ని యొక్క సూక్ష్మాతి సూక్ష్మం సూక్ష్మాతి సూక్ష్మ స్వరూపుడైన రుద్రుడనె అదిదేవత రుద్రుడనే ఆది దేవత కన్నను స్థూలాంశమైన రంబీజము. యొక్క ప్రేరేపణ వలన. రంబీజము కన్నను స్థూలాంశమైన జ్ఞానశక్తితోగూడుతోని. జ్ఞానశక్తి కన్నను స్థూలాంశమైన రూపతన్మాత్రద్వారా. రూపతన్మాత్ర కన్నను స్థూలాంశమైన అగ్నిభూతము. జలభూతము నుండి సకల చరాచరములను పోషింపు చున్న విష్ణువు. అగ్నిభూతము నుండి రుద్రస్వరూపుడై సకల చరాచరములను రూపించి రూపములను. మార్పుచేయుచున్న వాడాయెను.

4. అగ్నియొక్క స్థూలాంశము వాయువు వాయువు యొక్క సూక్ష్మాతి సూక్ష్మము సూక్ష్మాతి సూక్ష్మ స్వరూపుడైన ఈశ్వరుడనే అదిదేవత, ఈశ్వరుడనే ఆదిదేవత కన్నను స్థూలాంశమైన యంబీజము యొక్క ప్రేరేపణ వలన యంబీజము కన్నను బ్థూలాంశమైన ఆది శక్తితో గూడుతోని. ఆదిశక్తికన్నను స్థూలాంశమైన స్పర్శతన్మాత్ర ద్వారా స్వర్శతన్మాత్ర కన్నను స్థూలాంశమైన వాయు భూతము. అగ్ని భూతము. నుండి సకల చరా చరములను రూపించి రూపములను మార్పు చేయు రుద్రుడు. వాయుభూతమునుండి ఈశ్వర స్వరూపుడై సకల చరాచరములను విస్తిరింప చేయుచున్న వాడాయెను.

5. వాయుభూతము కన్నను స్థూలాంశమైన ఆకాశభూతము ఆకాశము యొక్క సూక్ష్మాతి సూక్ష్మం, సూక్ష్మాతి సూక్ష్మ స్వరూపుడైన. సదాశివుడనే అదిదేవత. సదాశివుడనే ఆది దేవత కన్నను. స్థూలాంశమైన అంబీజము యొక్క ప్రేరేపణ వలన అంబీజము కన్నను స్థూలాంశమైన పరాశక్తితో గూడుకొని. పరాశక్తి కన్నను స్థూలాంశమైన శబ్దతన్మాత్రద్వారా. శబ్దతన్మాత్రకన్నను స్థూలాంశమైన. ఆకాశ భూతము వాయు భూతమునుండి సకల చరాచరములను విస్తీర్ణింప చేయుచున్న ఈశ్వరుడు. ఆకాశభూతము నుండి సదాశివ స్వరూపుడై సకల చరాచరములను పెంపొందింప జేసిన వాడాయెను.

పెంపొందింప చేయుచున్న జీవులలో నరుని యొక్క ప్రమాణము ఎట్లనగా

సీ॥ నరుడు తొంబది యూరు నంగుళాలెనిమిది. జానల
పాదవు నాల్జానలెలుపు. నిట్లు ముప్పదిమూడు.
కోట్ల రోమంబులు, వెలయుడెబ్బది రెండు వేల నాళ్లు.
ఎముక లరువది యూరు. నమరు తొంబది రెండు కీళ్లు.
ముప్పది మూడు మూళ్లపేగు। శేరు గుండెలు అర్ధ సేరును
రుధిరంబు। మణుగు నాలుగు శేర్లు మాంస ముండు.
సోలపైత్యబు శ్లేష్మమర సోలె డుండు.
నీప్రకారంబుదేహంబు. లెంచిచూడ। రమ్య॥

**తాత్పర్యము** :- 96 అంగుళముల నరప్రయాణము 8 జావల పాదవు 4 జానల వెడల్పు, 33 కోట్ల రోమంబులు 72 వేల నరములు. 66 ఎముకలు 92 కీళ్లు 33 మూళ్ల పెద్దపేగు, శేరుగుండెలు అర్ధశేరు నెత్తురు. మణుగు నాలుగు శేర్ల మాంసము సోలెడు పైత్యము. అరసోలెడు శ్లేష్మము. విచారించగా సకల దేహము లీప్రకారముగా నుండును:

1. పంచ భూతముల వలన సృష్టింపబడినది. శరీరము
2. పంచతన్మాత్రల వలన సృష్టింప బడినది. యింద్రియములు
3. పంచశక్తులవలన సృష్టింప బడినది. జీవుడు
4. పంచబీజముల వలన సృష్టింప బడినది. ప్రాణము.
5. పంచదేవతల వలన సృష్టింప బడినది. ఆత్మ.

1. స్థూల శరీరము యొక్క వృత్తి బాల్య, యౌవన, కౌమార, వృద్ధ్యాప్యములు,
2. యింద్రియముల యొక్క వృత్తి। జాగ్రత్త స్వప్నము, సుషుప్తి, తురీయము;
3. జీవుని యొక్క వృత్తి, యింద్రియఅధిష్టాన దేవత, ప్రేరేపణ అను చేతనం,

4. ప్రాణము యొక్క వృత్తి, జాగ్రత స్వప్న, సుషుప్తి, యందు ఉచ్ఛ్వాస నిశ్వాసరూపకం

5. ఆత్మయొక్క వృత్తి స్వప్రకాశము. అనగా ప్రాణము. యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాస రూపకమును, జీవుని యొక్క యింద్రియప్రేరేపణ లక్షణమును, యింద్రియముల యొక్క జాగ్రత స్వప్నషుప్తులను తెలియజేయుట.

సీ॥ నరములస్థులు చర్మనఖరోమ మాంసముల్ భూగుణంబులు స్వేద మూత్ర శ్లేష్మములు శుక్ల శోణితంబులు జలగుణములు క్షుత్పిపాసాలస్య సుప్తి సంగములు, వహ్నిగుణములు, చలనదావన కంపనాకుం చన ప్రసరణా దికములు, పవమానగుణములు భయకామ మోహముల్ క్రోధలజ్జయు నబో గుణములివియు. పంచ భూతాంశ గుణముల బారదోలి. నీ స్వరూపంబు గనువాడు నిర్మలుండు ॥రమ్య॥









ఈ దినం శాశ్వతం కాదు.

## స్థూల శరీరనిర్ణయము

పంచభూతముల స్థూలాంశమైన, రెండవ విధములైన వస్తుపదార్థ మిశ్రమము. చేత స్థూల శరీరమాయెను. ఎట్లనగా

1. అవకాశాంశస్వరూపమైన ఆకాశ భూతాంశము యొక్క స్థూల పదార్థ నిర్ణయము అవకాంశస్వరూపమైన. ఆకాశభూతాంశము. యొక్క ముఖ్యాంశము శోకమనే పదార్థమాయెను. ఎట్లనగా.

   **శోకము** కలిగినప్పుడు. శరీరము శూన్యముగా వుండును ఆకాశము గూడ శూన్య స్వరూప, స్వభావము గలది గనుక, శోకమనే పదార్థ మాయెను.

2. **కామము.** అవకాశాం శస్వరూపమైన ఆకాశభూతాంశ మందు. చలనాంశ స్వరూప వాయువు భూతాంశము। చేరుటచే, కామము అనే పదార్ధమాయెను: ఎట్లనగా కామమనగా. చంచలము. వాయువు గూడ చలన స్వరూపస్వభావము కలది కనుక కామమనే పధార్ధ మాయెను?

3. **క్రోధము:** అవకాశాంశస్వరూపమైన ఆకాశభూతాంశ మందు. తేజాంశ స్వరూపమైన అగ్ని భూతాంశము కలియుట చేత క్రోధమనే పదార్ధ మాయెను. ఎట్లనగా క్రోధము వచ్చినప్పుడు శరీరము తప్తమగును. అగ్నిగూడ తపనశక్తి స్వరూప స్వభావము కలది గనుక క్రోధమనే పదార్ధమాయెను.

4. **మోహము.** అవకాశాంశ స్వరూపమైన అ కాశభూతాంశ మందు ద్రవాంశ స్వరూపమైన జలభూతాంశము చేరుటచే మోహమనే పదార్ధమాయెను। ఎట్లనగా పుత్రాదుల యందు. వ్యామో హము కలిగినప్పుడు. నేత్రముల నుండి జలబిందువులు ప్రసరించును. జలము కూడా అర్ధస్వరూప స్వబావము కలది గనుక మోహమనే పదార్ధమాయెను:-

5. **భయము:-** అవకాశాంశ స్వరూపమైన ఆకాశభూతాంశమందు. కఠినాంశ స్వరూపమైన పృధ్విభూతాంశము చేరుటచే భయమనే పదార్ధమాయెను ఎట్లనగా. భయము కలిగి నప్పుడు శరీరము జడస్వరూపమగు. పృధ్విగూడ జడ స్వరూప స్వభావము కలది గనుక. భయమనే పదార్ధమాయెను.

2. చలనాంశస్వరూపమైన వాయుభూతాంశము యొక్క స్థూలాంశ పదార్ధ నిర్ణయము। అవకాశాంశ స్వరూపమైన ఆకాశభూతము కన్నా స్థూలాంశమైన - చలనాంశ స్వరూపమైన వాయు భూతాంశము యొక్క ముఖ్యాంశము దావన మనే పదార్ధ మాయెను. ఎట్లనగా దావన మనగా పరుగెత్తుట, వాయువు గూడ పరుగెత్తు స్వరూప స్వభావము గల దిగనుక, దావనమనే పదార్ధ మాయెను.

1. **ప్రసరణ** : చెలనాంశ స్వరూపమైన వాయు భూతాంశ మందు అవకాశాంశ స్వరూపమైన ఆకాశభూతము చేరుటచే ప్రచురణ మనే పదార్ధమాయెను. ఎట్లనగా. ప్రచురణమనగా. భ్రమణ స్వరూపమైనది। వ్యాపింపబడునది। ఆకాశము కూడ వ్యాపింపబడునది. భ్రమణ స్వరూప స్వభావము కలది గనుక ప్రచురణమనే పదార్ధమాయెను.

**2. చలనము** :- చలనాంశ స్వరూపమైన, వాయు భూతాంశమందు. ద్రవాంశ స్వరూపమైన జలభూతము చేరుటచే చలనమనే పదార్థమాయెను। ఎట్లనగా చలనమనగా - చలించుట - జలముగూడ చలించు స్వరూప స్వభావము కలది గనుక చలనమనే పదార్థమాయెను.

**3 కంపము** :- చలనాంశస్వరూపమైన వాయుభూతాంశమందు తేజాంశ స్వరూపమైన అగ్ని భూతము చేరుట వలన కంపమనే పదార్థమాయెను ఎట్లనగా అగ్నిగూడ యెండించు స్వరూప స్వభావము గలది. కనుక కంపమనె పదార్థమాయెను।

**4 అకుంచనము** :- చలనాంశస్వరూపమైన వాయుభూతాంశ మందు కఠినాంశ స్వరూపమైన పృధ్వి భూతాంశము చేరుటచే ఆకుంచనమనె పదార్థమాయెను. ఎట్లనగా. ఆకుంచమనగా మడచుట పృధ్వి గూడ, ఆకుంచిత స్వరూప స్వభావము కలది గనుక అకుంచనమనే పదార్థమాయెను.

## 3. తేజాంశస్వరూపమైన అగ్ని భూతాంశము యొక్క స్థూల పదార్థ నిర్ణయము:-

**1. క్షుత్తు** :- చలనాంశ స్వరూపమైన వాయు భూతాంశము కన్న స్థూలాంశమైన, తేజాంశ స్వరూపమైన. అగ్ని భూతాంశము యొక్క. ముఖ్యాంశము. క్షుత్తు అనె పదార్థమాయెను ఎట్లనగా క్షుత్తు. అనగా ఆకలి క్షుత్తు వలన కలిగిన భక్ష్యాన్నము. భస్మమగును. అగ్నిగూడ సర్వమును భస్మము గావించు స్వరూప స్వభావము కలది. గనుక క్షుత్తు అనే పదార్థమాయెను.

**2. సుప్తి** :- తేజాంశ స్వరూపమైన అగ్ని భూతాంశమందు అవకాశాంశ స్వరూపమైన ఆకాశ భూతాంశము చేరుటచే సుప్తి అనె పదార్థమాయెను. ఎట్లనగా నిద్ర వచ్చునప్పుడు శరీరము శూన్యముగా నుండును. ఆకాశము. శూన్య స్వరూప స్వభావము కలది గనుక సుప్తి అనే పదార్థ మాయెను:

**3 పిపాస** : తేజాంశ స్వరూపమైన అగ్ని భూతాంశ మందు. చలనాంశ స్వరూపమైన వాయుభూతాంశము చేరుటచే. పిపాస, అనెపదార్థమాయెను. ఎట్లనగా దాహము కలిగి నప్పుడు కంఠము శోషించును. వాయువుకూడ యింకించు స్వరూపస్వభావము కలది. గనుక. పిపాస అనే పదార్థమాయెను:

**4. సంగము** :- తేజాంశస్వరూపమైన అగ్ని భూతాంశమందు ద్రవాంశ స్వరూపమైన. జలభూతాంశము. చేరుటచే, కాంతి, యనే పదార్థమాయెను. ఎట్లనగా. వేడి చేత జలము శూన్యమగును. కాంతియు. శూన్యమగును. గనుక కాంతియనే పదార్థమాయెను.

5. అలస్యము తేజాంశస్వరూపమైన. అగ్ని భూతాంశమందు. కఠినాంశ స్వరూపమైన. పృధ్వి భూతాంశము చేరుటచే. ఆలస్యం అనే పదార్థమాయెను. ఎట్లనగా. అలస్యము అనగా సోమరితనము. సోమరితనము కలిగినప్పుడు. శరీరము జడమగును పృధ్విగూడ. జడస్వరూప స్వభావము. కలది గనుక ఆలస్యము అనే పదార్థమాయెను.

**4 ద్రవాంశ స్వరూపమైన జలాంశము యొక్క స్థూల పదార్థ నిర్ణయము:**

**1 శుక్లము** :- తేజాంశస్వరూమైన. అగ్ని భూతాంశము కన్న స్థూలమైన ద్రవాంశ స్వరూపమైన. జలభూతాంశము యొక్క ముఖ్యాంశము.శుక్లమనే పదార్థమాయెను. ఎట్లనగా శుక్లము గర్భహేతువు - జలము వృక్షహేతువు కనుక శుక్లమనే పదార్థమాయెను.

**2 శ్లేష్మము:-** ద్రవాంశ స్వరూపమైన జలభూతాంశమందు అవకాశాంశ స్వరూపమైన ఆకాశ భూతము చేరుటచే లాల, యనే పదార్థమాయెను. ఎట్లనగా లాల, వుచ్చనీచ స్వరూపమైనది. ఆకాశము గూడ వుచ్చ నీచ స్వరూప స్వభావము కలది గనుక లాల యనే పదార్థ మాయెను.

**3. స్వేదము:-** ద్రవాంశస్వరూపమైన జలభూతాంశమందు. చలనాంశ స్వరూపమైన వాయు భూతాంశము. చేరుటచే. స్వేదమనే పదార్థమాయెను. ఎట్లనగా. స్వేదము. శ్రమ వలన కలుగును. వాయువు గూడ వ్యజన శ్రమ స్వరూప స్వభావము గలది. గనుక స్వేదమనే పదార్థమాయెను.

**4. మూత్రము:-** ద్రవాంశస్వరూపమైన, జలభూతాంశ మందు తేజాంశ స్వరూపమైన. అగ్ని భూతాంశాము. చేరుటచే, మూత్రమనే, పదార్థమాయెను, ఎట్లనగా. మూత్రము ఉష్ణముగా వుండును అగ్నిగూడా ఉష్ణశక్తి. స్వరూప స్వభావము కలది. గనుక మూత్రమనే పదార్థమాయెను.

**5 శోణితము:-** ద్రవాంశ స్వరూపమైన జలభూతాంశమందు పృధ్వి భూతాంశము చేరుటచే. శోణితమనే పదార్ధమా యెను. ఎట్లనగా శోణితము రక్త(వర్ణము) పృధ్వి గూడ రక్త వర్ణ స్వరూప స్వభావము కలది. గనుక శోణితమనే పదార్ధమాయెను.

## 5 కఠినాంశ స్వరూపమైన పృధ్వి భూతాంశము యొక్క స్థూల పదార్థ నిర్ణయము

**1 హస్తులు :-** ద్రవాంశ స్వరూపమైన జలభూతాంశ ముకన్నబ్దాలమైన కఠినాంశస్వరూపమైన పృధ్వి భూతాంశము యొక్క ముఖ్యాంశము హస్తులనే పదార్ధమాయెను. ఎట్లనగా. హస్తులు. కఠినత్వముగా నుండును. పృధ్వికూడ కఠిన స్వరూప స్వభావము కలది గనుక హస్తులనే పదార్ధమాయెను:

**2. నఖములు- రోమములు =** కఠినాంశస్వరూపమైన పృధ్వి భూతాంశమందు. అవకా శాంశ స్వరూపమైన పృధ్వి భూతాంశము చేరుటచే. నఖరోమములనే పదార్ధమాయెను. ఎట్లనగా. నఖరోమములు. కత్తి రించినను బాధలేదు. కనుక. ఆకాశాంశము శూన్య స్వరూపస్వ బావము కలది గనుక. నఖరోమములనే పదార్ధమాయెను.

**3. చర్మము :-** కఠినాంశ స్వరూపమైన పృధ్విభూతాంశమందు. చలనాంశ స్వరూపమైన. వాయుభూతాంశము చేరుటచే. చర్మమనే పదార్ధమాయెను. చర్మమనగా త్వక్కు. చర్మమువల్ల శీతోష్ణ స్పర్శల తెలియజేయు స్వరూప స్వబావము. కలది. గనుక చర్మమనే పదార్ధమాయెను.

**4. నరములు .** కఠినాంశస్వరూపమైన పృధ్వి భూతాంశ మందు. తేజాంశ స్వరూపమైన అగ్నిభూతాంశము చేరుటచే నరములనే పదార్ధ మాయెను ఎట్లనగా నరములవల్ల తాప పరీక్ష తేలియును. అగ్ని గూడ. తపన శక్తి స్వరూప స్వభావము. కలది గనుక నరములనె పదార్ధమాయెన.

**5. మాసము:-** కఠినాంశ స్వరూపమైన పృధ్వి భూతాంశమందు. ద్రవాంశ స్వరూపమైన జలభూతాంశము చేరుటచే. మాంసమవే. పదార్ధమాయెను ఎట్లనగా. మాంసము జలమువలె తడిగా నుండును కనుక మాంసమనే పదార్ధ మాయెను:-

## యింద్రియ మెట్లాయె ననగా:

పంచభూతములకు సూక్ష్మాంశమైన పంచతన్మాత్రల సముదాయమే. ఇంద్రియ ములాయెను. ఎట్లనగా :

1. పంచికృత సంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచికృత పంచభూత గంధ తన్మాత్ర వలన కలిగిన ఇంద్రియములు. వాక్కు, పాణి. పాదము. పాయువు. ఉపస్థలనేడి. కర్మేంద్రియములున్నూ

2. పంచికృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచీకృత పంచభూత రస. గంధముల నెడి విషయేంద్రియములున్నూ

3. పంచీకృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచీకృత పంచభూత రూప తన్మాత్ర వలన గలిగిన ఇంద్రియములు. శ్రోత్ర, త్వక్కు, చక్షు, జింహ్వ ఘ్రాణము. లనెడి జ్ఞానేంద్రియములున్నూ

4. పంచీకృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచికృత పంచభూత స్పర్శతన్మాత్ర వలనగలగిన ఇందియములు. సమాన,వ్యాన, ఉదాన, ప్రాణ అపాన, ములనెడి. ప్రాణేంద్రియములున్నూ.

5. పంచీకృత పంచభూతముల యొక్క. సూక్ష్మాంశమైన అపంచీకృత పంచభూత శబ్దతన్మాత్ర వలన గలిగిన ఇంద్రియములు. జ్ఞాన,మనస్సు. బుద్ధి చిత్తము. అహంకారములనెడి. అంతరేంద్రియముల. సముదాయమే యింద్రియము లాయెను।

## జీవుడు యెట్లాయెననగా

1. పంచీకృత పంచభూతముల యొక్కసూక్ష్మాంశమైన అపంచీకృత పంచ భూత. గంధ తన్మాత్ర వలన గలిగిన యింద్రియముల యొక్క అదిష్టాన దేవత లనెడి. అగ్ని యింద్రుడు. విష్ణువు. బ్రంహ్మ. మృత్యువులనెడి. క్రియాశక్తి యొక్క చైతన్యమున్నూ.

2. పంచీకృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచీకృత పంచ భూత రసతన్మాత్ర వలన గలిగిన యింద్రియముల యొక్క అధిష్టాన

దేవతలనెడి సదాశివుడు - ఈశ్వరుడు - రుద్రుడు -విష్ణువు బ్రహ్మఅనెడి ఇచ్చాశక్తి యొక్క చైతన్యమున్నూ.

3. పంచీకృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచీకృత పంచభూత రూప తన్మాత్రవలన గలిగిన యింద్రియముల యొక్క అధిష్టాన దేవతలనెడి దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీ దేవతలనెడి జ్ఞానశక్తియొక్క చైతన్యమున్నూ.

4. పంచీకృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచీకృత పంచభూత స్పర్శ తన్మాత్రవలన గలిగిన యింద్రియములయొక్క అధిష్టాన దేవతలనెడి జయుడు విశ్వయోని అజుడు, విశిష్టుడు విశ్వకర్తలనెడి ఆదిశక్తి యొక్క చైతన్యమున్నూ.

5. పంచీకృత పంభూతములయొక్క సూక్ష్మాంశమైన అపంచీకృత పంచభూత శబ్దతన్మాత్రవలన గలిగిన యింద్రియముల యొక్క అధిష్టాన దేవతలనెడి - ప్రత్యగాత్మ చంద్రుడు, బృహస్పతి, క్షేత్రజ్ఞుడు, రుద్రుడనెటి, పరాశక్తి యొక్క చైతన్యముల యొక్క చేరికే జీవుడాయెను.

**ప్రాణము యెట్లాయెననగా**

పంచశక్తుల యొక్క సూక్ష్మాంశమైన పంచబీజముల యొక్క చేరికే ప్రాణమాయెను. ఎట్లనగా.

1. పంచీకృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచీకృత పంచ భూత. గంధతన్మాత్ర వలన గలిగిన యింద్రియముల యొక్క ఆదిదేవతల యొక్క క్రియాశక్తి యొక్క చలనాంశమున్నూ.

2. పంచీకృతపంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచీకృత పంచభూత రసతన్మాత్ర వలన గలిగిన యింద్రియముల యొక్క అదిదేవతలయొ్క యిచ్చాశక్తి యొక్క చలనాంశమున్నూ.

3. పంచీకృత పంచ భూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచీ కృత పంచభూత. రూపతన్మాత్ర వలన కలిగిన యింద్రియముల యొక్క ఆది దేవతల యొక్క జ్ఞాన శక్తి యొక్క చలనాంశ మున్నూ.

యొక్క ఆదిశక్తి యొక్క చేతనా చలనాంశ యంబీజము యొక్క ప్రకాశమున్నూ.

5. పంచీకృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశమైన అపంచికృత పంచభూత శబ్ద తన్మాత్ర వలన గలిగిన యింద్రియముల యొక్క ఆదిదేవతల యొక్క పరాశక్తి యొక్క చేతనా చలనాంశ అంబీజము యొక్క ప్రకాశములచేరికే ఆత్మ ఆయెను। స్వయం ప్రకాశ స్వరూపమైన ప్రాణమునకు. స్థూలాంశమైన ఇంద్రియములు. చలనరూపమైన స్థూలాంశమైన శరీరమునకు వ్యవహారము జరుగుచున్నది జీవ ఇంద్రియముల చేరికచే ప్రజ్ఞ కలుగుచున్నది. దేనికది యున్న యెడల పిండాండ వ్యవహారము. జరుగ నేరదు .

**అవస్థలు 4.**

1. జాగ్రధా వస్థయందు. స్థూలము ఇంద్రియములు. జీవుడు. ప్రాణము ఆత్మ చేరి. పని చేయును. విశ్వుడు. అభిమాని.

2. స్వప్నావస్థయందు. స్థూలశరీరము పనిచేయ్యక. శయ్యపై బడియుండును. యింద్రియములు. జీవుడు ప్రాణము ఆత్మ పనిచేయును. తైజసుడు. అభిమాని.

3. సుషుప్తి అవస్తయందు. ప్రాణము ఆత్మ రెండే పనిచేయును. ప్రాజ్ఞుడు అభిమాని.

4. తురీయము. నందు ఆత్మ ఒక్కటెయుండును. ఆత్మ యందు ప్రాణము నిలిచిపోవును. జీవుడు. యింద్రియముల చేరికే సూక్ష్మ శరీరము. అగు. లింగశరీరమే యెరుకని చెప్పబడును. యీ విధముగా విశ్వమును పరమాత్మ ప్రవృత్తి చేయుటచేత. విశ్వ. యీశ్వర. విశ్వేశ్వర. అను నామముల చేత స్థోత్రము చేయుదురు...

ప్రవృత్తి మార్గపరశీలనా

సమాప్తము..

ఓం

# నివృత్తి మార్గము

**నివృత్తి మార్గము యెట్లనగా :**

1. శరీరశుద్ది :- స్వస్తికాసనము వలన కలుగును
2. యింద్రియ శుద్ధి తారక యోగ విచారణ వలన కలుగును.
3. జీవశుద్ధి : సాంఖ్య విచారణ వలన కలుగును.
4. ప్రాణ శుద్ధి. అమనస్క విచారణ వలన కలుగును.
5. ఆత్మశుద్ధి మహావాక్య విచారణ వలన కలుగును.

1. పైన చెప్పబడిన శరీర శుద్ధి ధర్భ దవళాసనముపై స్వస్తి కాసనుడై కూర్చుండి మనస్సు కిష్టమైనట్టి మంత్రము చలన ముడిగి నిశ్చల చిత్తముతో జపించిన శరీర శుద్ధియగును.

**వాక్యములు:**

(పరము) భ్రమమూలంమిదం జగత్
(ఇహము) ధనమూలం మిదం జగత్

**తారక యోగ విచారణ**

ముద్రలు ఆయిదు విధములు. ఎట్లనగా

1. ఖేచరి. 2. భూచరి 3. మధ్యమ 4 షణ్ముఖి 5 శాంభవి. యనునవి.

**1. ఖేచరి ముద్ర వివరణ**

గురుపాదార విందములు హృదయమున నిల్పికనుబొమల నడుమ

భాగమున దృష్టి నిలిపి పై భాగమునకు. జూడుము. ఖేచరిముద్ర బట్టబయలుగా. కనబడును ఆత్మారామునిజూడుము. యీ ఖేచరి ముద్రయందు చూపును మనస్సును ఏకము జేసి చూడగా నిజరూపము కనబడును. చూపురూపు వొకటి యైన పాపప్రత్యక్ష మగును. అపాప నిలచిన మీద నాపోజ్యోతి నీవై ప్రకాశించెదవు. యాపట్టు వదలక చూచినచో ఖెచరి ముద్రమనస్సుకుగోచరమగును.

## 2. షణ్ముఖీముద్ర వివరణ

నాదబింధు దళల నెప్పుడు నభ్యసించి గురువుచే పొందబడిన హఠయోగముచే బ్రహ్మైక్య లక్ష్యమైన షణ్ముఖీముద్రను హృదయాకాశ మధ్యను జూడుము. ఆత్మపథము నీకె దురుగా కనబడును చెవులను. కన్నులను, ముక్కురంధ్రములను మూసి, దృష్టినీ మనస్సుతో గూడ భ్రూమధ్య మందు స్థిరముగా నిలిపి నాదు బిందుకళలను ననుభవించుటకు షణ్ముఖీయని పేరు. దీని నీ ప్రకారం చూచితివేని పరిపూర్ణ మహా సముద్రమందు తన్మయుడవై యుండెదవు

## 3 భూచరి ముద్ర వివరణ

హృదయు చిదాకాశమధ్యమున భూచరీముద్రను కనుగొనుము శరీరమానసములు. పరవశ మొందించి యాత్మసుఖమును కలుగ చేయుయోగ లక్ష్యమిదే దీనిని జూచిన సర్వసాదకుడ య్యెదవు. నేత్రములు కదలనియ్యక ముక్కు కొనపై దృష్టి నిలిపి నిటలము నందెదురు చూచుటయె భూచరి ముద్ర దీనిని జూచి బేద రహితుడవై. బ్రంహ్మానంద పదవిలో పరిపూర్ణడవై ప్రకాశించెదవు.

## 4. మధ్యమ ముద్ర వివరణ

అంతర్మధ్య గోప్యమైన మధ్యమ ముద్రను జూడుము ఇది తుది మొదలేకంబై శివజీవైక్య సందాన మధ్య ప్రణవ నాదాంతర్గత మగు పరం జ్యోతిని దర్శింపజేసి మొదట పరిపూర్ణమును దెల్పి తుదకు యెరుకను విడిపించు మార్గమిదే.

కన్నులు సగము మూసి సగము తెరచి ముక్కు యొక్క మధ్యభాగము నందుదృష్టి నిల్పి అచ్చట నుండి పైభాగమున నున్న భ్రూమధ్యమును జూడ వలయును. ఇట్లు జూచుటకు మధ్యమ ముద్రయని పేరు. యీ ముద్ర నభ్యసించుటచే అనందము కలుగును. కామక్రోదాది వర్గములను అరణ్యమును దహించు కార్చిచ్చు వంటిది.

## 5. శాంభవి ముద్ర వివరణ

పరిపూర్ణ దృష్టి మనస్సున నుంచి శరీరమును మరచి లోపల వెలుపల నిదియది భేదము వదలి. శాంభవి ముద్రను జూడుము ఒక వస్తువు నందు దృష్టిని నిలుపుటయను నియమము లేకుండా కేవలము వెలుపలికి గాని లోపలికిగాని చూచుచు మనస్సును నిశ్చలము చేసి ప్రాణాయామ అభ్యాసము వలన గాలిని బందించి  నాదుబిందు కళలను ననుభవింపవలెను, ఇట్లు జూచుటకు శాంభవి ముద్రయని పేరు. యీ ముద్రను నీవు సాధించిన పరిపూర్ణా నంద గురు ప్రకాశమునీవై ప్రకాశించెదవు.

పైన వివరింపబడిన పంచ ముద్రలకు 1లో  చూపు 2. వెలిచూపు. 3. మధ్యమ. చూపు. అని మూడు విధములు.

భేచరి, శాంబవి, షణ్ముఖీ, యనునవి, లో చూపుగలవి,  అనగా కన్నులు మూసుకోని చూచుట) దినికే అమావాస్య దృష్టియని పేరు. భూచరి శాంభవి, వెలిచూపుగలవి అనగా కన్నులు తెరచి  చూచుట) దీనికి పౌర్ణమి, దృష్టియని పేరు. మధ్యమ చూపుగలది (అనగా అరకంటిచే చూచుట) దీనికే పాడ్యమి దృష్టియని పేరు. యీ అభ్యాసములచే చూపు, రూపు, నోకటి జేసి దివ్య తేజమును చూడము.

రెండు కన్నులకు ప్రక్కల సూత్రముగా. తర్జునులను చూపుడు వ్రేళ్లను నోప్పించి భ్రూమధ్యమున మనస్సు నిలిపి సచ్చి త్కళా ముద్రసు జూడుము. చిత్ర వర్ణములుగల,  చిత్కళలు. దహరాకాశమందు. కనబడును. ముద్రాభ్యాస పరులకు. పాత్రమైన ముద్ర యిదే. గురుకరణచే నీపంచ ముద్రల మరుగునెరిగి. గురుకుల ధర్మమును గుర్తెరిగి. యీ యోగలక్ష్య సాదనలచే నాదబిందు కళలను

గురిచేసి చూచినయెడల. మనస్సుగావి. ఇంద్రియములు గాని. వెలుపల లోపల సంచరింపక నాదు బిందుకళలనే జూచుకోని. నిలిచియుండును. గనుక నీవిధముగా మనస్సు నిశ్చలము జేసి ముక్తిని జెందుము, పరమ హంస నటనను తెలిసి కోనుము. నిటలాగ్ర దృష్టికి పైకి పండు వెన్నెల యందు. అమృతపానము జేసిన వాడవై త్రిపురాంతకుడ య్యెదవు. సంసారాంధకారమును పటాపంచలు. చేయు. స్వప్రకాశ చిద్భాస్కరుడవయ్యెదవు:-

## షట్కమల హంసతత్వ యోగ నిరూపణ

యీపరమహంస వాయువు తోగూడి అన్నికమలములందును. విహరించు చుండును. సూర్యోదయము మొదలుకొని మరల సూర్యోదయ మగువరకు నిరవది యొక్కవే. ఆరునూర్లు మార్లు సంచరించును. యీప్రకారము. ఆపోజ్యోతియైన హంసవాయుతో జేరి ఖండా ఖండముగా సర్వమునందును. సంచరించు చుండును.

1. మూలాదార చక్రంబనగా. గుదస్థానమందు, వ,శ,ష,స,అను నాలుగు అక్షరముల తోగూడిన నాల్గుధళములు గలదియు. పుటము వేసిన బంగారు కాంతి కలదియు. పృధ్విభూతమున కాదార భూతమైనదియు ప్రాణాకారణంబగునదియు. మూలాదార చక్రంబు గలదు. ఆచక్రాధి దేవత యగు విఘ్నేశ్వరునకు ఆరునూర్లు. అచ్చట హంస జపము జరుగును.

2. లింస్థానమున స్వాదిష్టాన చక్రము గలదు బ,భ, మ, య,ర,ల అను ఆరు అక్షరముల తోగూడిన ఆరుదళములు. కలిగిన రక్త వర్ణము తో. ఆచక్రము ప్రకాశించు చుండును. ఆదిజలభూతమునకు ఆధారము. జింహ్మేంద్రియ మునకు కారణము దాని కాదిదేవతయగు బ్రంహ్మ కచ్చట ఆరువేల హంసలు. జపము సమర్పింప బడును.

3. నాభియందు మణిపూరకమను చక్రమున్నది. అది పసుపుపచ్చని రంగు గలదియు, అగ్ని భూతమునకు వాసస్థానమైనదియు, నేత్రేంద్రియమునకు. కారణమైనదియు. డ,ఢ,ణ,త,థ,ద,ధ,న,ప,ఫ, అను బీబాక్షరముల తోగూడి. పదిదళములు కలిగి.శోభించును దానికధి దేవత యగు- విష్ణువునకు. అచ్చట ఆరువేల హంసలు. అర్పణ చేయబడును.

4. హృదయ స్థానమందు. అనహత చక్రమున్నది. అది తెల్లటివర్ణము, గలది, వాయు భూతమునకు, వునికి పట్టు, త్వగీంద్రయమునకు. కారణమైనది క,ఖ,గ, ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ,లను వర్ణముల తోటి పన్నెండు దళములు కలిగి యున్నది. దానికాది దేవతయగు రుద్రునకు అచ్చట ఆరువేలు జపము జరుగును.

5. కంఠస్థానమందు, విశుద్ధచక్రమున్నది. అది నీలవర్ణము గలది. ఆకాశ భూతమునకు, వునికి పట్టు. శోత్రమునకు కారణము అ,ఆ,ఇ,ఈ, ఉ, ఊ, ఋ,ౠ,ఌ,ౡ. ఎ.ఐ.ఓ.ఔ.అం.అః అను అచ్చుల తోటి పదియారు. దళములు. కలిగి ప్రకాశించు చున్నది. దానికాధి దేవతయగు. శమదమోపరతులచే నొప్పియుండు. జీవున కచ్చట. వెయ్య హంసలు. అర్పింపబడును.

6. భ్రూమధ్య స్థానమందు. ఆగ్నేయ చక్రముండును. అదిమాణిక్య వర్ణము. గలది. నివాస స్థానమైయున్నది. హంక్షం, అను వర్ణముల తో గూడిన రెండు దళములతో నొప్పుచుండును. అచ్చట దానికాధి దేవతయగు. పరబ్రహ్మమున కొక్క వెయ్య హంసల అర్పణజరుగును..

7. బ్రంహ్మరంధ్రాంతరమున కోటి సూర్యప్రకాశమై. ఓంకారమను బీజముతో. గూడుకొన్న సహాస్ర దళములుగల సహాస్రారమను పేరు గల కమలమున్నది. సుషుప్తి యందు బుద్ధి మొదలగునవి. లయంచు స్థాన మదియె. దానికి గురు మూర్తి ఆదిదేవత. ఆయనకు అచ్చట నోక. సహాస్ర హంసల అర్పణ జరుగును.

## అష్టదళ పద్మాంతర పరమ-హంస సంచార క్రమము

హృదయమందుందు. అష్టదళ పద్మము యొక్క మధ్యను. హంస దీపా కృతిగా వెలుగుచు. గాలిచెనన్ని దిశలు తిరుగుచు. యెనిమిది దళముల మీదను చరించివాలును. తూర్పు దళము మీద వ్రాలిన పుణ్యకార్యములు చేయు చింతయు. ఆగ్నేయమున నిద్ర ఆలస్యము, దక్షిణ దళమున. క్రౌర్యము. నైరుతి.

మూలదళము మీద హంస వ్రాలినప్పుడు. క్రీడలయందు. యిచ్ఛ కలుగు చుండును. అహంస వాయువ్యదళమున నిలిచియున్నప్పుడు. నడువ వలెనని తలంపు ఉత్తర ధళమందున్నప్పుడు. రతియందు ఇచ్ఛయు. ఈశాన్య ధళమున ధన ధాన్యాదుల యందు చింతయు. కలుగును. కమల మధ్య మందున్నప్పుడు. వైరాగ్యముపుట్టును. కేసరముల యందున్న.ప్పుడు. జాగ్రతయు. కర్ణిక యందున్నప్పుడు. స్వప్నమును తోడిమయందున్నప్పుడు. సుషుప్తియు. ననుభవింపబడును. ఆ.హంస పద్మము. విడిచి నప్పుడు. ప్రణవార్థమైన ఘంట నాదమందులయము నోందును ఆనాదము మూలాదారము మొదలు కొని. బ్రంహ్మ రంధ్రము వరకు శుద్ధస్ఫటిక ప్రభతోటి నోకటె విధముగా సకలమందు వ్యాపించి యున్నది. అదియె పరబ్రహ్మ తత్వ రహాస్యమని తెలుసుకొనియోగులు. యీపరమ హంస సాధన చేయుచుందురు.

## పరమహంసోపానన జీవన్ముక్తి క్రమము

హృదయాంతరమున. గోర్రెముఖమువంటి నోక గోళకమున్నది. అందు హంసగాయత్రీ మంత్రముగా. "సోహం" అనుధ్వని సదా ప్రభలియున్నది. నీవు ముక్తడవు అవుటకు. ఆనాదము వినుము. ధారణా భ్యాసము లేకుండా యోగమహిమ లెరుగుటకు. తరముగాదు. దీని వలన మనస్సు చలించ కుండా. నిలచును. గాన. హంస సంచార మందు. రేచక పూరక కుంభకములచే పరమ హంసను కలియుము. కుడితట్టు. యిడానాడి. ఎడమది పింగళ నాడి. నడిమిది సుషుమ్నా నాడి. యీమూడు నాడులవివరము. చక్కగా దెలిసి కొని. మనసు ప్రక్కల ప్రసరింపజేయక. మధ్యనాడి యందు దృష్టి నిల్పి. నన్ను నమ్మి. ఆత్మారాముని యందు చేరుము.

హృదయమందున్న ప్రాణవాయువు నాసికము నుండి పన్నెండు అంగుళములు వెలుపలకు. వచ్చును. అదియె రేచకమన బడును. వచ్చినకాలము లోసగము వెపలనిలుచును. దానికి బహిః కుంభక మని పేరు. యిట్లే లోపల జనుటకు. పూరక మనియు అర్ధకాల మణగియుండుటకు. అంతర కుంభకమని పేరు. దీనినే ప్రాణాయామ మని యందురు. ఈ త్రి విధ ప్రాణాయామ లక్షణముచే

గాలి తిరిగి మనస్సు తోటి ఈ హంస కూడిన మార్గము యొక్క రహస్యము. నభ్యాసము చే గ్రహించిన వారు. కామాది వికార రహితులై మోక్షమును పొందెదరు.

హంస జపించు విధము. ఏమనగా పూరకమందు హ, కారమున్నదనియు. అంతర కుంభకము నందుబిందువున్నదనియు. రేచకమునందు న, కారమున్నదనియు. భావన చేసి జపించు జపమును. తెలుసుకోను. జ్ఞానమను హంస మఖిల చేతనా తనువుల యందును. నిండి యున్నది. దీనికీలు తెలసికొని సాధించుటకే ముక్తి యని పేరు. నాదు బిందుకళా తీతమై సచ్చిదానంద స్వరూపమై ప్రకాశించు పరమాత్ముడు. హ, కారమనబడును. దేహేంద్రియాది దృశ్యరూపిణియగు ప్రకృతి. స, కారమనబడును. ఈ పురుష ప్రకృతులు గలసుటే హకార సకారమధ్యం సున్న బిందువు. గనుక హంస, యనబడును, సకల కర్మములను చేయించు పవనము తోగూడియున్న మనస్సు యొక్క అగ్ర మందుండు కర్తృత్వాది. ధర్మములుగల బుద్ధియే, బిందువనబడును. వాయువుయొక్క ధ్వనినాద మనబడును. ఈ బిందు నాదములకు సాక్షి యైయున్న యాత్మ ప్రతిబింబమై కళయనబడును. యీత్రి విధయోగభ్యాసములచే శివ జీవైక్య సమాధినిజెందును... యేడు కొండలపైన మూడు నదులను కలసి కనకా చలమును. అండజేసుకొని. దశవిధ నాదములగు అంతర్మండలమును దాటి అండ మధ్యమున అజప కుండలీయున్నది. కుండలీయనగా. పామువలెనుండు నాడి అది సుషుమ్నునాడి తో పెనగొని నిటలాంతము దాకా. వ్రేలు చుండును. అట్టి ఆజప కుండలిని సాధించిన సుషుమ్నాంత మందు. బ్రంహ్మాండ ఖండాండ దర్శన మగును.

రాకడ పోకడ లేనిస్థలమందు. దహరాకాశ గవిని వాకిలి దీసి నిరాకారమున నిలిపి. సుషుమ్నాంతమున నేకాగ్ర దృష్టితోజూడుము. ఈ ముద్రలుచూడగా చూడగా. నెన్నో చిత్రములు గనిపించి మనస్సుకు వేడుకలు కలుగ జేసి యింత లోనె చూడకుండ పోవుచున్నది. యెప్పటి కిని ఈలాగె జరుగుచున్నది. అని మొట్ట మొదటనే యివినిలి చేవికావని. జాడ తెలుసుకున్న వాడు. చాలాధన్యుడు.

పాటల చేతను మాటల చేతను. సత్క్రియలచేతను యోగమార్గములను గురువులు అనేక విధములుగా భోదించుచుందురు. ఆకాల మునకది. యీకాలమున కిది. పాక భేదమె కాని. పరిపూర్ణమొక్క టేనని నమ్ముము. సత్యహృదయము తోటి. పరమ గురుని. మహిమ లెరిగి. తనగురు ధర్మములను గురిచే నెరవేర్చు చున్నట్టి గురుపుత్రునకు ఇహపరములందు యేమి కోరతలేదు. వాని తోటి సాటి యెవరులేరు. గురువే బ్రంహ్మ గురువే విష్ణువు. గురువే మహేశ్వరుడని గురుభక్తి గలిగి సేవించితే గురువే రక్షించును...

**పంచీకరణి సాంఖ్య విచారణ.**

**తామస పంచభూతముల సృష్టి**

**1. (ఆకాశతమో అంశము)**

సమిష్టి వ్యష్టి అను రెండు భాగంబులై. సమిష్టి తన నిజాంశములో వుండుట చేత జ్ఞాత ఆయెను.

వ్యష్టి నాల్గుబాగంబులై వకటవ భాగము. వాయువు యొక్క తమో అంశము.

వ్యష్టి వకటవ భాగము కలసి మనస్స ఆయెను. (అకాశము తమోఅంశము. వ్యష్టి రెండవ భాగము. అగ్ని యొక్క), ఆకాశము తమో అంశము. వ్యష్టి రెండవ భాగము. అగ్ని యొక్క తమో అంశము. వ్యష్టి వకటవ భాగము కలసి బుద్ధి ఆయెను.

జలము తమో అంశము వ్యష్టివ భాగము. ఆకాశము తమో అంశము. వ్యష్టి 3వ భాగము. కలసి చిత్తమాయెను పృద్వితమో అంశము వ్యష్టి1 భాగము. ఆకాశము.తమో అంశము వ్యష్టి 4 వ భాగము కలసి అహంకారమాయెను జ్ఞాత, మనస్సు, బుద్ధి చిత్తము, అహంకారములు, అంతరేంద్రియములు.

**వాయువు**

వాయువు తమో అంశము. సమిష్టి వ్యష్టి అను రెండు భాగంబులై, సమిష్టి తన నిజాంశము లో ఉండుట చేత వ్యాన, మాయెను.

వ్యష్టి నాల్గు భాగంబులై 1 వ భాగము ఆకాశము యొక్క తమో అంశము. వ్యష్టి 1వ  భాగము కలసి సమాన, మాయెను. వాయువు తమో అంశము వ్యష్టి 2వభాగము. ప్రాణ మాయెను. వాయువు తమో అంశము. వ్యష్టి 4 వ భాగము పృధ్వితమో అంశము. వ్యష్టి2వ బాగము కలసి. అపానమాయెనువ్యాన, సమాన, ఉదాన ప్రాణ, అపానములు. ప్రాణేంద్రియములు.

**అగ్ని**

అగ్నితమోఅంశము. వ్యష్టి. సమిష్టి. అను రెండు భాగం బులై సమిష్టి. తన నిజాంశములో ఉండుటచేత చక్షువాయెను.........

వ్యష్టి నాల్గుభాగంబులై 1వ భాగము అకాశము యొక్కత మో అంశము. వ్యష్టి 2వ భాగము కలసి శ్రోత్రమాయెను.

అగ్నితమో అంశము. వ్యష్టి 2 వభాగము. వాయువు యొక్కతమో అంశము. వ్యష్టి 2 వ భాగము కలసి త్వక్కువాయెను.

అగ్ని యొక్క తమో అంశము. వ్యష్టి 3 వ భాగము జలము యొక్క తమో అంశము. వ్యష్టి 3 వ భాగము కలసి జిహ్మ ఆయెను.

అగ్నితమో అంశము. వ్యష్టి 4 భాగము పృధ్వితమో అంశము వ్యష్టి 3 వ భాగము కలసి ఘ్రాణమాయెను.

చక్షు, శ్రోత్రము, త్వక్కు, జింహ్వ ఘ్రాణము జ్ఞానేంద్రియులు

**జలము**

జలము తమోఅంశము సమిష్టి వ్యష్టి అను రెండు భాగంబులై సమిష్టి. తన నిజాంశములో ఉండుట వలన, రసము అయెను...

వ్యష్టి 4 భాగంబులై 1 వ భాగము ఆకాశము తమో అంశము వ్యష్టి 3 వభాగము కలిసి శబ్ద మాయెను.

జలముతమో అంశము వ్యష్టి 2 వభాగము. వాయువు తమో అంశము. వ్యష్టి 3 వభాగము కలసి స్పర్శ ఆయెను..

జలము తమో అంశము వ్యష్టి 3 వభాగము. అగ్నితమో అంశము వ్యష్టి 3 వ భాగము కలసి రూపమాయెను.

జలముతమొూ అంశము. వ్యష్టి 4 వ భాగము. పృధ్వితమోఆంశము. వ్యష్టి 4 వభాగము కలసి గంధమాయెను.

రసము శబ్దము స్పర్శ, రూప, గంధములు విషయేంద్రియములు.

**పృధ్వి**

పృధ్వితమో అంశము సమిష్టి వ్యష్టియను రెండు భాగంబులై సమిష్టి తన నిజాంశములో వుండుటచేత గుదము.

వ్యష్టినాల్గు భాగంబువై 1 భాగము ఆకాశము ఆయెను తమో అంశము వ్యష్టి 4 వ భాగము. కలసి వాక్కు ఆయెను.

పృధ్వితమో అంశము. వ్యష్టి 2 వ భాగము; వాయువు తమో అంశము. వ్యష్టి 4 వ భాగము కలసి పాణి ఆయెను..

పృధ్వితమో అంశము వ్యష్టి 3 వభాగము. అగ్నితమో అంశము. వ్యష్టి 4వ భాగము కలసి పాదమాయెను.

పృధ్వితమో అంశము వ్యష్టి 4వ భాగము జలము తమో అంశము వ్యష్టి 4 వ భాగము కలసి గుహ్యమాయెను.

గుధము. వాక్కు పాణి. పాదము గుహ్యము కర్మేంద్రియములు.

ఈ విధముగా పంచీకరణము చేయబడిన తామస భూతముల చేతను. స్థూల దేహమాయెను....

**సాత్విక సమిష్టి అంతఃకరణ**

1. సాత్విక అకాశములో సమిష్టి 1 వ భాగము. కూటస్థుడనే అదిదేవతతో కూడుకోని. భ్రూమధ్య గోళక మందు. చేరి సకలేంద్రియ గ్రహ కర్తృత్వమును చేయు చుండును.

2. సాత్విక వాయువుతో సమిష్టి 1 భాగము. చంద్రుడనే అదిదేవత తోకూడుకొని. మనోగోళక మందు చేరి. సంకల్ప వికల్పములు చేయుచుండును.

3. సాత్విక అగ్నిలో సమిష్టి 1 బాగము. బ్రహస్పతి అనే ఆది దేవతతో గూడుకొని బుద్ధి గోళకమందు చేరి. మనస్సుచేసిన సంకల్ప వికల్పములను. నిశ్చయాను సందానము చేయుచుండును.

4 సాత్విక జలముతో. సమిష్టి 1 వ భాగము విష్ణువు అనె ఆది దేవతతో కూడుకొని. చిత్తగోళక మందు చేరి బుద్ధి చేసిన నిశ్చ యాన్ని. చింతన చేయుచుండును.

5. సాత్విక పృధ్వితో సమిష్టి 1 వభాగము రుద్రుడనే ఆదిదేవతతో కూడులోని. అహంకారగోళక మందు చేరి. అహం, అనేక బుద్ధులు కల్పన చేయుచుండును.

## సాత్వికవ్యష్టి జ్ఞానేంద్రియములు

1. సాత్విక ఆకాశము. వ్యష్టి 2 వ భాగము. దిక్కులనెడి ఆదిదేతతో కూడుకొని. శ్రోత్రెంద్రియ గోళక మందు చేరి దశవిధ శబ్దములను యెరుగు చుండును.

2. సాత్విక వాయువులో వ్యష్టి 2 వభాగము. వాయువు అనెడి ఆది దేవతతో కూరుకొని త్వక్కేంద్రియ గోళక మందు చేరిచతుర్విధ స్పర్శలను యెరుగు చుండును.

3. స్వాత్విక అగ్నిలో వ్యష్టి 2 వ భాగము సూర్యుడనెడి అదిదెవత తో కూడుకొని. చక్షురింద్రియ గోళకమందు చేరి.పలువిధరూపములను ఎరుగు చుండును....

4. సాత్విక జలములో వ్యష్టి2 వ భాగము వరుణుడనెడి అదిదేవతతో కూడుకోని. జహ్వేంద్రియ గోళక మందు చేరి షడ్రుచులను యెరుగు చుండును.

5. సాత్విక పృధ్విలో వ్యష్టి 2 వ భాగము అశ్విని దేవతలనెడి ఆది దేవతతో కూడుకోని. ఘ్రాణేంద్రియ గోళక మందు చేరి త్రివిధగందములను యెరుగు చుండును.

**రాజస సమిష్టి వాయువులు:**

1. రాజస అకాశముతో సమిష్టి 1వ భాగము జయుడనె ఆది దేవతతో గూడుకొని సమానవాయువు గోళకమందు చేరి భక్షణచేసిన చతుర్విధ పదార్థములను పచనము చేసి 72 వేలనాడులకు సమానముగా పంచిపెట్టు చుండును.

2. రాజసవాయువులో సమిష్టి 1 వ భాగము. విశ్వయోని అనె ఆదిదేవత తోగూడుకొని వ్యానవాయువు గోళకమందు చేరి. సకలశరీర వ్యాపకత్వము చేయుచుండును.

3. రాజస అగ్నితో సమిష్టి 1 వభాగమును అజుడనెడి. అదిదేవతతో కూడుకొని. ఉదాన వాయువు. గోళక మందు చేరి. వైఖరి పలుకులు పలుకు చుండును.

4. రాజస జలముతో. సమిష్టి 1 వ భాగము విశిష్ణుండనెడి ఆదిదేవతో గూడుకొని. ప్రాణవాయువు గోళక మందు చేరి ఊర్ధ్వ గమన వ్యాపారము చేయుచుండును..

5. రాజ సపృధ్విలో సమిష్టి 1వ భాగము విశ్వకర్త అనెడి ఆదిదేవతతో కూడుకోని. అపాన వాయువు. గోళకమందు చేరి అధో గమన వ్యాపారము చేయుచుండును.

**రాజస వ్యష్టి కర్మేంద్రియములు**

1. రాజస ఆకాశములో వ్యష్టి 2 భాగము అగ్నియనే ఆదిదేవత తోగూడుకొని. వాగింద్రియ గోళకమందు చేరి లౌకిక వైదిక పలుకులు పలుకుచుండును.

2. రాజసవాయువులో వ్యష్టి 2 వ భాగము ఇంద్రుడనెడి అదిదేవత తోగూడుకోని. పాణేంద్రియ గోళకమందు చేరి దాన ప్రతిగ్రహకంబులు చేయుచుండును.

3. రాజస ఆగ్నిలో వ్యష్టి 2వ భాగము విష్ణువనెడి. ఆదిదేవత తోగూడుకొని. పాదేంద్రియ గోళకమందు. చేరి. గమనా గమన వ్యాపారములు చేయు చుండును.

4. రాజసజలములో వ్యష్టి 2 వ భాగము బ్రంహ్మ అనెడి అది దేవతతో గూడు

కొని గుహ్యేంద్రియ గోళక మందుచేరి మూత్రానంద విసర్జన చేయు చుండును.

5. రాజన పృధ్వీలో వ్యష్టి 2 భాగము, మృత్యువు అనెది అది దేవతతో గూడుకోని. పాయురింద్రియ గోళక మందు చేరి జీవోపహార సంబంధమైన పిష్టమును (మలము) విసర్జింపుచుండును....

**జ్ఞాత**

1. జ్ఞానము, అంతఃకరణ స్వరూపుడై కూటస్థాదిదేవత ప్రేరేపకత్వము వల్ల సమాను నితోగూడుకొని. శ్రోత్రేంద్రియ ముల ద్వారా శబ్దమును గ్రహిస్తు వాగేంద్రియముద్వారా వచింపుచుండును.

2. ఈజ్ఞాతే మనోరూపుడై చంద్రాదిదేవత ప్రేరేపకత్వము వల్ల వ్యానుని తోగూడుకో నిత్వగింద్రియముద్వారా. స్పర్శనుగ్రహిస్తు పాణేంద్రియము ద్వారా యిచ్చిపుచ్చు కొనుచుండును.....

3. యీజ్ఞాతే, బుద్ధి రూపుడై బ్రహస్పతి అనెడి ఆదిదేవత ప్రేరేపకత్వము వల్ల ఉదానుని తోగూడుకొని చక్షు రింద్రియము ద్వారారూపమును గ్రహిస్తు పాదేంద్రియము ద్వారా గమనాగమనము చేయు చుండును.

4. యీజ్ఞాతే. చిత్తరూపుడై విష్ణువనే ఆదిదేవత ప్రేరేపకత్వము వల్ల ప్రాణునితో గూడుకోని. జిహ్వేద్రియ ము ద్వారారుచులను గ్రహిస్తు గుహ్యేంద్రియము ద్వారా అనందింపుచుండును.

5. యీజ్ఞాతే అహంకారరూపుండై రుద్రాది దేవత ప్రేరేపకత్వము వల్ల అపానునితోగూడుకొని. ఘ్రాణేంద్రీయము ద్వారా గంధమునుగ్రహిస్తూ పాయురింద్రియ ముద్వారా విసర్జింపు చుండును.

1. అకాశభూతమున్నూ ఆకాశ తత్వమున్నూ కలసిజ్ఞాత అయినది
2. ఆకాశభూతమున్నూ వాయుతత్వమున్నూ కలసి. మనస్స ఆయనది.
3. అకాశభూతమున్నూ అగ్నితత్వమున్నూ కలసి, బుద్ధి అయినది..
4. అకాశభూతమున్నూ జలతత్వమున్నూ కలసి చిత్తమాయెను.
5. అకాశభూతమున్నూ పృధ్వీతత్వమున్నూ కలసి. అహంకారమయినది.

1. వాయుభూతమున్నూ, ఆకాశతత్వమున్నూ కలసి సమానమయినది.
2. వాయుభూతమున్నూ వాయుతత్వమున్నూ కలసి, వ్యానమయినది.
3. వాయుభూతమున్నూ అగ్నితత్వమున్నూ కలసి, ఉదానమయినది.
4. వాయుభూతమున్నూ జలతత్వమున్నూ కలసి ప్రాణమయినది.
5. వాయు భూతమున్నూ పృద్వితత్వమున్నూ కలసి అపానమయినది.

1. అగ్నిభూతమున్నూ ఆకాశతత్వమున్నూ. కలసి శ్రోత్ర మయినది.
2. అగ్నిభూతమున్నూ వాయుతత్వమున్నూ కలసి త్వక్కుఅయినది.
3. అగ్నిభూతమున్నూ అగ్నితత్వమున్నూ కలసి చక్షు అయినది.
4. అగ్నిభూతమున్నూ జలతత్వమున్నూ కలసి జింహ్వ అయినది.
5. అగ్నిభూతమున్నూ. పృధ్వితత్వమున్నూ, కలసి ఘ్రాణమయినది.

1. జలభూతమున్నూ ఆకాశతత్వమున్నూ కలసి శబ్దమయినది.
2. జలభూతమున్నూ. వాయు తత్వమున్నూ కలసి స్పర్శఅయినది.
3. జలభూతమున్నూ అగ్నితత్వమున్నూ. కలసి రూపమయినది.
4. జలభూతమున్నూ. జలతత్వమున్నూ కలసి రసమయినది.
5. జలభూతమున్నూ పృద్వితత్వమున్నూ. కలసి గంధమయినది.

1. పృధ్వి భూతమున్నూ, ఆకాశతత్వమున్నూ కలసి వాక్కు అయినది.
2. పృధ్వి భూతమున్నూ వాయుతత్వమున్నూ కలసి పాణిఅయినది.
3. పృధ్విభూతమున్నూ అగ్నితత్వమున్నూ కలసి పాదమయినది.
4. పృధ్విభూతమున్నూ జలతత్వమున్నూ. కలసి గుహ్యమయినది.
5. పృధ్విభూతమున్నూ పృధ్వితత్వమున్నూ కలసి గుదమాయెను.

**ఆకాశపంచకము**

1. జ్ఞాత, అద్యాత్మ ఎరుగుట ఆదిబౌతికము కూటస్థుడు ఆదిదై వికము భ్రూమధ్యస్థానము ఆకాశభూతము.

2. మనుస్సు ఆధ్యాత్మ సంకల్పము ఆధిభౌతికము చంద్రుడు ఆది దైవికం కంఠస్థానము వాయుభూతము.

3. బుద్ధి ఆధ్యాత్మ.నిశ్చయము. ఆదిజాతికము. బ్రహస్పతి ఆదిదై వికము ముఖస్థానము. అగ్నిభూతము.

**జలపంచకము**

1. శబ్దము అధ్యాత్మ ధ్వని ఆదిబౌతికము. సధాశివుడు. ఆదిదైవికము. చెవులుస్థానము ఆకాశ భూతము.

2. స్పర్శ.అధ్యాత్మ తాకుడు. ఆది బౌతికము ఈశ్వరుడు. ఆదిదైవికము చర్మముస్థానము వాయు భూతము

3. రూపము ఆధ్యాత్మ. వర్ణము ఆది బౌతికము. రుద్రుడు. ఆదిదైవికము కన్నులు స్థానము. అగ్ని భూతము

4. రసము. అధ్యాత్మ. రుచి. ఆదిబౌతికము. విష్ణువు. ఆది దైవికము నాలుకస్థానము జలభూతము

5. గంధము అధ్యాత్మవాసన. ఆదిబౌతికము. బ్రంహ్మ. ఆదిదైవికము, ముక్కుస్థానము.పృధ్విభూతము.

**పృధ్విపంచకము**

1. వాక్కు ఆధ్యాత్మ వచనము ఆదిబౌతికము. అగ్ని ఆదిదైవికము నోరుస్థానము. ఆకాశభూతము.

2. పాణి ఆధ్యాత్మదానము. ఆదిబౌతికము. ఇంద్రుడు. ఆదిదైవికము చేతులు స్థానము వాయు భూతము.

3. పాదము ఆధ్యాత్మి గమనము ఆదిభౌతికము విష్ణువు. ఆదిదైవికము కాళ్లు స్థానము. అగ్నిభూతము.

4. గుహ్యము అధ్యాత్మ ఆనందము. ఆదిబౌతికము బ్రంహ్మ ఆదిదైవికము. లింగము స్థానము. జలభూతము.

5. గుదము. ఆధ్యాత్మ విసర్జన. ఆది బౌతికము. మృత్యువు, ఆదిదైవికము. పాయువు స్థానము. పృద్విభూతము.

**యేకభావము పృథ్వి తత్వము :**

1. ఆకాశము యొక్క అవకాశాంశమును పృధ్వియొక్క కఠినాంశము కలిసి వాక్కు అయినది. కనుక ఆకాశము యొక్క ఆవకాశాంశమును. ఆకాశమున కిచ్చి వేసి తావచ్చి పృద్వి తోకలసితె వాక్కు లయం.

2. వాయువు యొక్క చలనాంశమును. పృధ్వియొక్క కఠినాంశమును కలిసి పాణిఅయినది కనుక వాయుయొక్క చలనాంశమును వాయువున కిచ్చివేసి తావచ్చి పృద్వితో కలిసితె పాణిలయం

3. అగ్నియొక్క తేజాంశము పృధ్వి యొక్క కఠినాంశము కలసి పాదమయినది. కనుక అగ్నితేజాంశము అగ్నికి యిచ్చివేసితావచ్చి పృధ్వితో కలసితే పాదం లయం.

4. జలము యొక్క రసాంశము పృధ్వియొక్క కఠినాంశము కలసి గుహ్యామైనది. కనుక జలము యొక్క రసాంశము జలముకిచ్చివేసి. తావచ్చిపృధ్విలో కలసితే గుహ్యాం లయం

**జలతత్వము**

1 ఆకాశము యొక్క అవకాశాంశమును జలము యొక్క రసాంశమును కలసి శబ్దమైనది . కనుక ఆకాశము యొక్క ఆవకాశాంశమును ఆకాశమునకిచ్చి వేసి. తావచ్చిజలములో కలసితె శబ్దము లయం

2. వాయువు యొక్క చలాంశమున్నూ జలము యొక్క రసాంశమును కలసి స్పర్శ అయినది. కనుక. వాయువు యొక్క చలనాంశము వాయువున కిచ్చి తావచ్చి జలములో కలసితె స్పర్శలయం.

3. అగ్నియొక్కతే జాంశమును . జలము యొక్క రసాంశమును కలసి రూపమాయెను. కనుక అగ్ని యొక్కతే జాంశము అగ్నికిచ్చివేసి తావచ్చి జలముతో కలిసితే రూపములయం.

4. పృధ్వి యొక్క కఠినాంశమున్ను జలము యొక్క రసాంశమున్ను. కలసి గంధమైనది. కనుక పృధ్వియొక్క కఠినాంశము పృధ్వికిచ్చితా వచ్చి జలములో కలసితే గంధం లయం.

**అగ్నితత్వము**

1 ఆకాశము యొక్క అవకాశాంశమును అగ్నియొక్కతే జాంశము కలసి శ్రోత్రమైనది కనుక ఆకాశము యొక్క అవకాశాంశమును అకాశమున కిచ్చి వేసి తావచ్చి అగ్నిలో కలసితె శ్రోత్రము లయం

2. వాయువు యొక్క చలనాంశమును. అగ్ని యొక్కతే జాంశమును కలసి త్వక్కు అయినది కనుక వాయువు యొక్క చలనాంశమును వాయువున కిచ్చి వేసితా వచ్చి అగ్నిలో కలసితె త్వక్కులయం

3. జలము యొక్క రసాంశమున్ను అగ్ని యొక్కతే జాంశమున్ను కలసి జింహ్వా అయినది. కనుక జలము యొక్క రసాంశమును. జలమున కిచ్చి వేసి తావచ్చి అగ్నిలో కలసితే జింహ్వా లయం

4. పృధ్వి యొక్క కఠినాంశము అగ్ని యొక్కతే జాంశమును కలసి ఘ్రూణమైనది. కనుక పృధ్వియొక్క కఠినాంశమును పృధ్వి కిచ్చివేసి తావచ్చి అగ్నిలో కలసితె ఘ్రూణములయం

**వాయుతత్వము**

1. ఆకాశము యొక్క ఆవకాశాంశమును. వాయువుయొక్క చలనాంశమును కలసి సమానమైనది కనుక ఆకాశము యొక్క అవకాశాంశమును. ఆకాశమున కిచ్చి వేసితా వచ్చి వాయువులో చేరితె సమానము లయం

2. అగ్నియొక్కతే జాంశమును వాయుయొక్క చలనాంశము కలసి ఉదానమైనది. కనుక అగ్నియెక్కతే జాంశమును అగ్ని కిచ్చి వేసి తా వచ్చి వాయువుతో కలసితె ఉదానము లయం

3. జలము యొక్క రసాంశమును. వాయువు యొక్క చలనాంశమును కలసి ప్రాణమైనది కనుకజలము యొక్క రసాంశమును జలమునకిచ్చి వేసితా వచ్చి ప్రాణములో కలిసితె ప్రాణం. లయం

4. పృధ్వియొక్క కఠినాంశము. వాయువు యొక్క చలనాంశము. కలసి అపానమైనది కనుక పృధ్వి యొక్క కఠినాంశమును పృధ్వి కిచ్చివేసితా వచ్చి వాయువులో చేరితే అపానము లయం.

**ఆకాశ తత్వము**

1 వాయువు యొక్క చలనాంశమును. అకాశము యొక్క అవకాశాంశ మును. కలసి మనస్సు అయినది. కనుక వాయువు యొక్క చలనాంశ మును. వాయువున కిచ్చివేసి తావచ్చి. ఆకాశములో కలిసితె మనస్సు లయం.

2. అగ్ని యొక్కతేజాంశమును. ఆకాశము యొక్క అవకాంశమును. కలసి బుద్ధి అయినది కనుక అగ్నియొక్కతే జాంశమును. అగ్ని కిచ్చి వేసితా వచ్చి. ఆకాశములో చేరితె బుద్ధిలయం.

3. జలము యొక్క రసాంశమును. ఆకాశము యొక్క ఆవకాశాంశమును కలసి చిత్తమైనది కనుక జలము యొక్క రసాంశమును. జలమున కిచ్చి వేసితా వచ్చి. ఆకాశములో చేరితె చిత్తము లయం.

4. పృథ్వి యొక్క కఠినాంశమును. ఆకాశము యొక్క అవకాశాంశమును కలసి అహంకారమైనది, కనుక పృథ్వియొక్క కఠినాంశమును. పృథ్వి కిచ్చి వేసితా వచ్చి. ఆకాశములో చేరితె అహంకారము లయం?

1 జలమునందు పుట్టిన పృథ్విజలము కంటె వ్యతిరిక్తము కాదు. కనుక జలమందే . లయం......

అదెట్లనగా పెద్దమడుగులో చిన్న మట్టి పెల్ల వేయగా. ఎట్లు కలసి పోవునో. అట్లె పృథ్వి జలమునందు లయం.

2. అగ్నియందు బుట్టిన జలం అగ్నికంటె వ్యతిరిక్తము. కాదు కనుక అగ్నియందే లయం అదెట్లనగా. ఎర్రగా కాలినట్టి ఇనుపముక్క మీద జలము చల్లిన నెట్లు యింకి పోవునో అట్లె జలము అగ్నియందు. లయం.

3. వాయునందు బుట్టిన అగ్ని వాయువు కంటెవ్యతిరిక్తము కాదు. కనుక వాయువు నందు లయం అదెట్లనగా గాలివీచు చున్నపుడు. దీపము ఎట్లు ఆరిపోవునో అట్లె అగ్నివాయువు నందు లయం......

4. ఆకాశమునందు బుట్టిన వాయువు ఆకాశముకంటె వ్యతిరిక్తముకాదు. కనుక. ఆకాశమందే లయం ఎట్లనగా పొగ మేఘములందు ఎట్లులయమగునో అట్లె ఆవాయువు ఆకాశమందు లయం

5. సుషుప్తియందు. జీవులు ఎట్లులయమగుచున్నావో అట్లె ఆకాశము ప్రకృతి యందు లయం.

## అమనస్కవిచారణ

**పంచకోశముల నిర్ణయము.**

సీ॥ అన్నరసంబుతో నైన శోణిత శుక్ల మయమైన ఈ దేహమన్నమయము.

పంచప్రాణంబులు ప్రభలి కర్మేంద్రియ
పంచకంబును. గూడి ప్రాణమయము
జ్ఞానేంద్రియములైదు. మానసంబొక్కటి.
కూడియైనది. మనో కోశమయము.
చెలగిజ్ఞానేంద్రియంబులు బుద్ధియును గూడి.
విజ్ఞానమయమున విధ్యయందు మనసు కలసిన
ఆనందమయము లిట్లు పంచకోశంబులకు
సాక్షిపరుడవీవు ॥రమ్య॥

**తాత్పర్యము** : అన్నరసంబు తోనైనదేహము అన్నమయ కోశము. పంచ ప్రాణంబులు పంచకర్మేంద్రియంబులు కూడినది. ప్రాణమయ కోశము పంచజ్ఞానేంద్రి యంబులు మనస్సు కూడినది. మనోమయ కోశము

జ్ఞానేంద్రియంబులు బుద్ధి కూడినది విజ్ఞానమయ కోశము
ప్రకృతి యందు మనస్సు లీనమగుట ఆనంద మయ కోశము
కోశ నిర్ణయము యొక్క పద్ధతి తెలియజేయునట్టి స్వప్రకాశ
హిరణ్మయ కోశము....

## పంచకోశ ధర్మములు

అన్నమయ కోశము యొక్క ధర్మములు జననమరణములు.

ప్రాణమయ కోశము యొక్క ధర్మములు. ఆకలి దప్పులు మనోమయ కోశము యొక్కధర్మములు. సంకల్ప వికల్పములు సంకల్పసిద్ధి కొరకు చేయునది. విజ్ఞానమయ కోశము సంకల్పములు వికల్పములు బొందిన యెడల ఆనందమయ కోశమె దుఃఖ స్వరూపము...

పంచకోశముల యందు ప్రాణమయ కోశము యొక్క ఆకలి దప్పుల తృప్తికొరకు మనోమయ కోశము సంకల్పించు చున్నది. కనుక క్రియారూపమగు నట్టివి. ప్రాణమయ మనోమయ, కోశంబులు, మిగతా అన్నమయ, విజ్ఞానమయ. ఆనందమయ కోశంబులు భావరూపకమని చెప్పబడును క్రియారూపకమై ప్రాణమయ మనోమయ కోశంబులలో ముఖ్యమగునది. మనోమయ కోశము.

ఎందుకనగా. మనస్సు యొక్క సంకల్పము వల్లనే క్రియారూపకమైన కర్మ జరుగుచున్నది. కనుక మనోమయ కోశము యొక్క సంకల్పాది లక్షణము వల్లనేపు నర్జన్మకు కారణమగుచున్నందున. మనోమయ కోశము నివృత్తి కొరకు. ప్రపంచమున. మంత్రో పాసకులు మంత్రములను. ద్యానించుచున్నారు.

భక్తులు భజనలు సల్పువారు. మతసాంప్రదాయకులయందు. మత లక్ష్యాను సారముగ వర్తించుచున్నారు. యోగము ఆసన, ముద్రాభ్యాసములు. సలుపు చున్నారు. మహావాక్యముల ద్వారా తత్వవిచారణ చేయుచున్నారు. మంత్రాలయ, హఠ రాజయోగంబులు సలుపుచున్నారు. యిన్ని లక్షణంబులు, మనోమయకోశము యొక్క రహితము కోరకు చేయుచున్నను. అంతః కరణము నశింపబడక, బ్రహ్మైక్యమని జీవుడు. ఈశ్వరుని యందు ఐక్యమనిన్ని సత్యతోక, వైకుంఠము, కైలాసముల యందు, సాలోక్య సామీప్య, సారూప్య సాయుజ్య, సాక్షిత్వ. విదేహము కలుగు ననెడి భ్రాంతిపెంపగు చున్నది కనుక అందువల్ల అంతః కరణ రాహిత్యముగాక. పునరావృత్తికి. కారణమగు చున్నది. కనుక. పునరావృత్తి రాహిత్యము గోరు వారు పరిపూర్ణ బోధ తెలియ వలెనని. సిద్ధాంతము. జీవన్ముక్తియందు స్వరూపమనోనాశమున్నూ. విదేహముక్తి యందు అరూపమ నోనాశనమున్నూ గలుగును. ఎట్లనగా

**స్వరూప మనోనాశన మనగా .....**

ప్రారబ్దమునశించు వరకు జీవన్ముక్తుని స్థూలసూక్ష్మ శరీరములు నశింపవు. గాన, అప్పట్లో అతని యొక్క మనస్సు కర్తృత్వ భోక్తత్వములనెడి అభిమానము లున్నూ అనగా రాజసతామస, గుణములున్నూ. క్రామ క్రోదాదులు లేనిదిగా యుండును అట్లు అభిమాన మున్నూ కామాది వృత్తులున్నూ మనస్సుకు లేక పాటయే. స్వరూపమనోనా శనమనబడును. సుఖవంతులయందు స్నేహభావము, కరుణ అనగా దుఃఖించు వారియందు, దయసజ్జన సంఘమందు ఆనందము. దుర్జనులందు ఉదాసీనత్వము అనునీ సద్గుణములు కలిగి రాజస తామస వృత్తులును వదలి వ్యవహరించు చుండుటె స్వరూపమనో నాశన మనబడును.

**అరూపమనో నాశనము**

అనగా విదేహముక్తి యందు ప్రారబ్దమున్నూ దానికితోడు స్థూల సూక్ష కారణములనెడి. దేహత్రయమున్నూ నశించును గాన అప్పట్లో మనస్సు రూపము

లేక నశించును అనగా కర్పూర దీపము. కర్పూరమున్నంత వరకు వెలిగి అది నశించిన తోడనే మహతే జోరూపమును. చెందినట్లు ఆమనస్సు పరబ్రంహ్మము నందు లయించి బ్రహ్మస్వరూపమగును. అట్లు విదేహముక్తియందు. కర్పూదీపము రీతిగా మనస్సు రూపము లేక బోత్తిగా పరబ్రహ్మము నందు లయించి బ్రహ్మస్వరూపమగుటే అరూపమనోనాశనమనబడును.

## మహోవాక్యవిచారణ

1. ఋగ్వేదము : ప్రజ్ఞానం బ్రహ్మ విధివాక్యం స్థూలరహితం
2. యజుర్వేదము = అహంబ్రహ్మాస్మి, శిష్యవాక్యం, సూక్ష్మరహితం
3. సామవేదము = తత్వమసిబ్రహ్మ గురు వాక్యం కారణ రహితం
4. అధర్వణవేదము = అయమాత్మబ్రహ్మ : సాక్షాత్కారవాక్యం = బ్రహ్మ.

## ఋగ్వేదవాక్యము

1. ప్రజ్ఞానంబ్రహ్మ. ఆకాశఅర్ధభాగమునందు. యేజ్ఞానము కలదో. అజ్ఞానమె 84 లక్షల జంతువుల యందు కలదని తెలియుట ప్రజ్ఞానమె. ఆకాశ అధిష్టానమని. తెలియుట బ్రహ్మమనబడును.ఇది నస్థాల శరీరరహతమునకు. తెలుసుకునే విధి వాక్యార్థమన బడును.

## యజుర్వేదవాక్యం

అహంబ్రహ్మాస్మి అంతఃకరణ అధిష్ఠానమైన ప్రత్యగాత్మ ఇంద్రియ జన్యమైన గుణముచే వ్యవహారము విడీచి నందున, ప్రత్యగాత్మయె బ్రహ్మయగును. సూక్ష్మ శరీర రహితమునకు చెప్పిన శిష్యవాక్యము.

## సామవేదవాక్యం

తత్వమసిబ్రహ్మ తత్ అనగా ఈశ్వరుడు. త్వం అనగా నేను నాకుగల అవస్థాత్రయుములు కించిత్జ్ఞాత్వాది. గుణములు ఈశ్వరునకు గల అవస్థాత్రయములు. సర్వజ్ఞాత్వాది గుణముల ప్రకృతి జన్యఉపాధి విడచిన కారణ శరీర రహితమని తెలిపిన గురువాక్యం....

అంతఃకరణ అధిష్టానముత్వం అనియు మాయా అధిష్ఠానము తత్ అనీయు. ఉపాధి భేదములు కలుగుచున్నవని శంకరాగ అజహర్లక్షనము చెప్పడడినది.

**అజహార్లక్షణము:**

1 జహదర్లక్షణ మనగా విడిచిన లక్షణం విడువని లక్షణం విడిచి విడువని లక్షణం అని తెలియనగును.

గంగా యాం ఘోషా, అనగా గంగలో గోల్ల పల్లెయని అర్థము గంగ ప్రవాహరూపము గనుక . ప్రవాహమున గోల్ల పల్లె యుండుట. అసంభవమని తెలిసి ప్రవాహమును విడిచి ప్రవాహమునకు సంబంధించిన ఒడ్డుపైన గోల్లపల్లె యున్నది అని తెలియడయె. విడచిన లక్షణం అనబడును.

2. మంచాం క్రోషంతి అనగా మంచె కూయుచున్నదని యర్థము. మంచె జడస్వరూపము గలది గనుక కూయనేరదు మంచెపైనున్న మనిషి కూయు చున్నాడని మంచెను విడువక. మనిషిని తెలుసు కొనుటయె. విడువని లక్షణం అనబడును.

3. స్వయందేవదత్త అనగా ఒకే దేవదత్తుడని అర్థము. ఎట్లనగా దేవదత్తుడనే పిల్లవాడు ఐదు సంవత్సరముల వయసున కాశిపట్టణమున చూచినాను అదే దేవదత్తుని .యాభై సంవత్సరముల వయసున ఆ చంటతో చూచినాను. ఆవయస్సు ఈ వయస్సు కాకపోయిన. ఆకాశి ఈ ఆచంట కాక పోయిన వాటిని విడిచి ఆవచ్చే దేవదత్తుడే ఈ దేవదత్తుడని తెలసినట్లు. విడిచి విడువని లక్షణ మనబడును.

**అధర్వణ వేదవాక్యం:**

అయమాత్మ అనగా ఈ అత్మనే . బ్రహ్మము అనే అర్థము యివి గురు శిష్యుల వుభయులకు సాక్షాత్కార వాక్యమనబడును అయ అనగా ఇది . యం అనగా అది. అది ఇదియను వ్యవహార బేధంబులు అగుచున్నదని శంకరాగా మహాకాశ దృష్టాంతము ఎట్లునగా ఒక మహాకాశమే ఘటా ఆరణవలన ఘటాకాశమని మఠా ఆవరణవలన మఠాకాశమనియు ఆవరణ వలన కలిగిన వ్యవహారనామములే. కాని మహాకాశమునకు. ఘటా, మఠా ఆవరణంబులు లేనట్టుగా బ్రహ్మమునకు అంతః కరణాకరణము వలన వ్యవహారమే అయం ఇయం అది ఇది అని ప్రకృతి వ్యవహారనామంబులే కాని బ్రహ్మమందు భేదము లేదని తెలియవలెను. తెలుసుటే గురు శిష్యుల వుభయుల సాక్షాత్కార వాక్యమన

బడును. అచలపరిపూర్ణ బ్రహ్మ యందు ఒకపురుషుడు పుట్టనూలేదు గిట్టుసూలేదు. గనుక ఆవరణ రహిత అచల అనుశృతి రీతిగా అయం వ్యర్థం అని అచల సాంప్రదాయక సిద్ధాంత వ్యాకము.

1. కాలత్రయములలోనుండు వాడు ఈ శ్వరుడని చెప్పబడును.
2. కాలత్రయములకు అతీతముగా నుండు నపుడు ఆత్మ యనబడును
3. అవస్థాత్రయములలో నుండి వ్యవహరించువాడు ప్రత్యగాత్మ అనబడును.
4. అవస్థాత్రయములకు సాక్షిగానుండు వాడు జీవుడు అనబడును.

బ్రహ్మాండము పిండాండము 84 లక్షల జీవోపాదిగలది ఆత్మ ప్రకాశము. రాత్రి చీకటి, మధ్యాహ్నం పగలు, సంధ్యాకాలము సూర్యోదయమునకు పూర్వము. తర్వాత. సంధ్యా కాలము నలుపు భూతాకాశము ఇది పిండాడమునకు ఆవరణ. బ్రంహ్మాండమునకు పంచాకాశములు, ఆవరణ, ఇది నిర్గుణము దీని యందు సగుణ సృష్టి, ప్రత్యగాత్మ రూపముగా యున్నది. మూడవస్థలతోను. వ్యవహారము చేయుచున్నను. వాడు ఆత్మస్వరూపమును తెలిసినప్పుడు. వ్యాపకరూపుడగు చున్నాడు. అపుడు పంచశక్తులు భీజములు. వగైరాలు ఏమియును. పంచ ఆవరణములు లేక. స్వప్రకాశస్వరూపుడై. వ్యాపక రూపుడగుచున్నాడు. అంతఃకరణము యొక్క దిగువ భాగము సూర్యాకాశము. నిరవయాకాశము. చిదాకాశము 1-3 లమధ్య 2 యెగువ భాగము నందు దహరాకాశము. కాలత్ర యంబులు సమిష్టి అంతఃకరణ. దిగువ భాగము శరీరమందు. అపాదమస్తక పర్యంతము. వ్యవహారమున్నను. భ్రూమధ్యస్థాన మందే వ్యవహారము తోచుచున్నది. పంచభూతముల

పంచతన్మాత్రలు అధిష్టాన భూతమె భూతాకాశము
మహదహంకారం : పంచతన్మాత్రల మూలమె సూర్యాకాశము.
మహత్ : పంచ శక్తుల మూలమె. నిరవయాకాశము.
అవ్యక్తము : పంచ బీజముల మూలమె దహరాకాశము
బ్రహ్మము : పంచ ఆదిదేవతల మూలమె. మహాకాశము.

దీనినే శాస్త్రము నందు బ్రహ్మణో రవ్యక్తా అవ్యత్తో మహత్, మహతో మహదహంకారః మహాదహంకార పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యో పంచభూతాని. పంచభూతాని అఖిలంజగత్ అని చెప్పబడినది.

మద్యను నిండి నిబడీకృతమై యుండుట వలన పరిపూర్ణమని పేరు - జీవుని యొక్క మోక్షమువలన ప్రయోజనము లేదు 84 లక్షల జీవోపాధి ఖర్మ పల సమిష్టి అంతః కరణము యొక్క రహితస్థితిని తెలియవలెను.

ఇది అక్షరుడు. చలనము కలదని దీని రహిత స్థితియందు అచలమని పేరు. దీనికి కారణము వుత్తమ పురుష్టసానము యిది మహాకాశం. వ్యాపక రూపము నిర్గుణ స్వరూపము ఇది శుద్ధ వియత్. ఇది బ్రహ్మము. యిది సదాశివ స్థానం. యిదే బ్రహ్మము అవ్యక్తము దీనికి సహజముగ కదలిక లేదు. కనుక యిది కదలిక గలిగించు శక్తి గలది. సూదంటు రాయికి కదలికలేక పాయినను కదలించు శక్తి కలదు.

**:సర్వం సద్గురు చరణార వింరార్పణ మస్తు:**

**కందార్థం ॥**

ఆవరణము నాకసము, నిరావరణమచల మనుచు. అనిరి మహాత్ముల్. ఆవరణము మితిగలిగినది. ఆవరణము లేంది. యమితమని తెలసుకోరా. యూరెంట్ని వేరని కనుక్కొరా ఆవరణముననేనిరావరణమును జూచి, యావరణ మెడలీ నావాల మాట లేదని తెలుసుకోరా. యూ రెంట్ని వేరని కనుక్కొరా ॥

**ముప్పదియారు తత్వముల చక్రము**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కామం | జ్ఞానం | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారం |
| క్రోధం | సమానం | వ్యానం | ఉదానం | ప్రాణం | అపానం |
| లోభం | శ్రోత్రం | త్వక్కు | చక్షు | జిహ్మ | ఘ్రాణం |
| మోహం | శబ్దం | స్పర్శం | రూపం | రసం | గందం |
| మదం | వాక్కు | పాణి | పాదం | గుహ్యం | గుదము. |
| మత్సరం | వచనం | దానం | గమనం | ఆనందం | విసర్జనం |

## జ్ఞానేంద్రియములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రోత్రేంద్రి యమునకు | ఆకాశ భూతం | దశ దిక్కులు ఆదిదేవతలు | శబ్దమె విషయం | క్షరా క్షర ములు | శబ్ద బేదములు 2 |
| త్వగిం ద్రియ మునకు | వాయు భూతం | రుద్రుడు ఆది దేవత | స్పర్శమె విషయం | శీతం, ఉష్ణం మృదువు కఠినం | స్పర్శ బేదములు 4 |
| చక్షురిం ద్రియము నకు | అగ్ని భూతం | సూర్యుడు ఆదిదేవత | రూపమే విషయం | శ్వేత, పీత హరిత, రక్త మజ్జిష్ఠ, కృష్ణ | రూప బేదములు 6 |
| జింహ్యేం ద్రియము నకు | ఉదక భూతం | వరుణుడు ఆదిదేవత | రసమే విషయం | మధుర, ఆమ్ల తిక్త కటుకషాయ లవణ | రస బేదములు 6 |
| ఘ్రాణేంద్రి యమునకు | పృథివి భూతం | అశ్వినిదేవత ఆదిదేవతలు | గంధమె విషయం | సుగంధ దుర్గంధ | గంధ బే ములు 2 |

## కర్మేంద్రియములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| వాగింద్రియ మునకు | నాగ వాయువు | సరస్వతి ఆదిదేవత | వచనమే విషయం | సువాక్యములు దుర్వాక్యములు | వచన బే॥ 2 |
| త్వగింద్రయ మునకు | కూర్మ వాయువు | దేవేంద్రుడు ఆదిదేవత | దానమే విషయం | దానదానములు | దానబే॥ 2 |
| ప్రాణేంద్రియ మునకు | కృకుర వాయువు | విష్ణువు ఆదిదేవత | గమనమె విషయం | గమనాగమన ములు | గమనబే॥ 2 |
| గుహ్యేంద్రియ మునకు | ధనుంజయ వాయువు | బ్రహ్మప్రజాపతి ఆదిదేవత | ఆనందమే విషయం | ఆనందం కేవలానందం | ఆనంద బే॥ 2 |
| పాయువింద్రి యమునకు | దేవదత్త వాయువు | మృత్యువు ఆదిదేవత | విసర్జనమే విషయం | మలవిసర్జనం | విసర్జన బే॥ 1 |

## జ్ఞానేంద్రియములకు విషయములు

శ్రోత్రమునకు విషయం శబ్దము. త్వక్కుకు. విషయం స్పర్శ చక్షువునకు విషయము. రూపము జిహ్మకు విషయము రసము ఘ్రాణమునకు విషయము. గంధము

## కర్మేంద్రియములకు విషయములు

వాక్కుకు. విషయము వచనము పాణికి విదానము పాదమునకు వి॥ గమనము.

గుహ్యమునకు వి॥ ఆనందము పాయువునకు. వి॥ విసర్జన.

## అంతరింద్రియములకు విషయములు.

మనస్సుకు వి॥ సంకల్పము బుద్ధికి వి॥ నిశ్చయము చిత్తమునకు వి॥ చింతన

అహంకారమునకు వి॥ అహంకర్తృత్వము. లేక. అభిమానము.

103 కందార్థము తొమ్మిది తొర్రలు గల మేన్మరికి

శ్రీమత్ భాగవతకృష్ణదేశి కేంద్రువారి స్వహస్త లిఖితగ్రందము నుండి వ్రాయనైనది.

నిరామయ మైనషువంటి పరమాత్మయందు. ఆమాయాశబ్దంబైనషు వంటి మూల ప్రకృతి బుట్టె ప్రకృతి రెండుబాగాలాయె శుద్దానకు ప్రకృతి ఆయ శబలానకు మాయ. ఆయ ప్రకృతి యందు ఆకాశంబుట్టె. ఆకాశం రెండుబాగాలాయె. శుద్దానకు ఆకాశమాయ. శబలానకు. అంతః కరణ ఆయ. ఆకాశమందు వాయువుబుట్టె. వాయువు రెండు బాగంబులాయె. శుద్దానకు వాయువాయ.

శబలానకు మనస్సాయ వాయువందగ్ని బుట్టె. అగ్ని రెండు బాగంబులాయె శుద్దానకు అగ్ని ఆయ - శబలానకు - బుద్ధి ఆయ - అగ్ని యందు ఉదకంబుట్టె - ఉదకంరెండు బాగాలాయ శుద్దానకు ఉదక మాయ శబలానకు చిత్తమాయ ఉదకమందు పృద్విబుట్టె. పృద్వి రెండు బాగాలాయ. శుద్దానకు పృధ్విఆయ. శబలానకు ఆహంకారమాయ. పృధ్వియందు. ఓషదులు బుట్టె. ఓషదులు రెండు బాగాలాయ. శుద్దానకు ఓషదులాయ. శబలానకు త్వగ్రోమాలాయ. ఓషదులందు అన్నంబుట్టె. అన్నంబు రెండు బాగంబులాయ. శుద్దానకు శ్వేదమాయ. శబలానకురక్తమాయ. రక్త శ్వేతోభయులు కూడి పురుషుడాయె. పురుషుడు రెండు బాగాలాయ శుద్దానకు ఈశ్వరుడాయ. శబలానకు జీవుడాయ. జీవేశ్వరుభయులు కూడి. విశ్వమాయ విశ్వంరెండు బాగాలాదు శుద్దానకు పారమార్థికమాయ. శబలానకు ప్రపంచమాయ. ప్రపంచ పారమార్థికాలు భయులు కూడి. పృధ్వియందు లయమాయ. పృద్విఉదకమందు. వుదక మగ్నియందు. అగ్నివాయునందు. వాయువాకాశమందు ఆకాశమంతః కరణమందు అంతః కరణ ప్రత్యగాత్మ యందు. ప్రత్యగాత్మ పరమాత్మయందు. లయ మాయెనని యెరుంగ వలెను.

*శ్రీ గురవేనమః*

## తెలుగు సంవత్సరములు

**పురుషాంతం లేక 60 సంవత్సరములు**

**ప్రభవ - విభవ - శుక్ల - ప్రమోదూత - ప్రజోత్పత్తి - అంగీరస - శ్రీముఖ - భవ - యువ - దాతు - ఈశ్వర - బహుదాన్య - ప్రమాది - విక్రమ - వృష - చిత్రభాను - స్వభాను - తారణ - పార్థివ - వ్యయ - సర్వజిత్తు - సర్వధారి - విరోధి - వికృతి - ఖర - నందన - విజయ - జయ - మన్మధ - దుర్ముఖి - హేవళంబి - విళంబి - వికారి - శార్వరి - ప్లవ - శుభకృతు - శోభకృతు - క్రోధి - విశ్వావసు - పరాభవ - ప్లవంగ - కీలక - సౌమ్య - సాధారణ - విరోధికృతు - పరీదావి - ప్రమాదీచ - ఆనంద - రాక్షస - నళ - పింగళ - కాళయుక్తి - సిద్ధాద్రి - రౌద్రి - దుర్మతి - దుందుభి - రుధిరోద్గారి - రక్తాక్షి - క్రోధన - అక్షయ**

# నామకరణ విషయమై మాస నామములు

| చాంద్రమాసములు | వేదోక్త మాస నామములు | మగ శిశువు | ఆడ శిశువు |
|---|---|---|---|
| ౧ చైత్రము | మధుః | కృష్ణః | భూమిః |
| ౨ వైశాఖము | మాధవః | అనంతః | కల్యాణి |
| ౩ జ్యేష్ఠము | శుక్రః | అచ్యుతః | సత్యభామా |
| ౪ ఆషాఢము | శుచిః | చక్రిః | పుణ్యవతి |
| ౫ శ్రావణము | నభః | వైకుంఠః | రూపిణి |
| ౬ భాద్రపదము | నభస్యః | జనార్ధనః | ఇందుమతి |
| ౭ ఆశ్వియుజము | ఇషః | ఉపేంద్రః | చంద్రావతి |
| ౮ కార్తీకము | ఊర్జః | యజ్ఞపురుషః | లక్ష్మి |
| ౯ మార్గశిరము | సహః | వాసుదేవః | వాగ్దేవి |
| ౧౦ పౌష్యము | సహస్యః | హరిః | పద్మావతి |
| ౧౧ మాఘము | తపః | గోవిందః | శ్రీదేవి |
| ౧౨ ఫాల్గుణము | తపస్యః | పుండరీకాక్షః | సావిత్రి |
| **నక్షత్రములు** | **అధిపతులు** | **నక్షత్రములు** | **అధిపతులు** |
| ౧ అశ్వినికి | అశ్విని దేవతలు | ౧౫ స్వాతికి | వాయువు |
| ౨ భరణికి | యముడు | ౧౬ విశాఖకు | ఇంద్రాగ్నులు |
| ౩ కృత్తికకు | అగ్ని | ౧౭ అనురాధకు | మిత్రుడు |
| ౪ రోహిణికి | బ్రహ్మ | ౧౮ జేష్ఠకు | ఇంద్రుడు |
| ౫ మృగశిరకు | చంద్రుడు | ౧౯ మూలకు | రాక్షసుడు |
| ౬ ఆరుద్రకు | రుద్రుడు | ౨౦ పూర్వాషాఢకు | జలము |
| ౭ పునర్వసుకు | ఆదితి | ౨౧ ఉత్తరాషాఢకు | విశ్వేదేవతలు |
| ౮ పుష్యమికి | గురుడు | ౨౨ అభిజిత్తుకు | బ్రహ్మ |
| ౯ ఆశ్లేషకు | పాము | ౨౩ శ్రవణమునకు | విష్ణువు |
| ౧౦ మఘకు | పితృదేవతలు | ౨౪ ధనిష్ఠకు | వసువులు |
| ౧౧ పుబ్బకు | భవుడు | ౨౫ శతభిషమునకు | వరుణుడు |
| ౧౨ ఉత్తరకు | అర్యముడు | ౨౬ పూర్వాభాద్రకు | అజైకపాదుడు |
| ౧౩ హస్తకు | శని | ౨౭ ఉత్తరాభాద్రకు | అహిర్బుధ్నుడు |
| ౧౪ చిత్రకు | త్వష్ట | ౨౮ రేవతికి | పూషయను సూర్యుడు |